# THE GOSPEL OF JOHN.

# యోహాను వ్రాసిన సువార్త.

## ౧ పర్వము.

ఆదియందు వాక్యము వుండెను. వాక్యము
౨ దేవునియొద్ద వుండెను. వాక్యము దేవుడై యుం
డెను. అది* ఆదియందు దేవునియొద్ద వుండెను.
౩ సమస్తమున్ను దాని* వల్ల కలిగెను. యేదిన్ని
౪ అది* లేకుండా కలుగలేదు. దానిలో† జీవము
వుండెను. ఆ జీవము మనుష్యులకు వెలుగై యుం
౫ డెను. వెలుగు చీకటిలో ప్రకాశిస్తున్నది అయితే
చీకటి దాని గ్రహించలేదు.
౬ దేవుని యొద్దనుంచి పంపబడిన వొక మనుష్యుడు
౭ వుండెను. ఆయన పేరు యోహాను. ఆయనవల్ల
అందరున్ను విశ్వసించేకొరకు వెలుగును గురించి
౮ సాక్ష్యమిచ్చుటకు సాక్షిగా వచ్చెను. ఆయన వెలు
గును గురించి సాక్ష్యమిచ్చుటకేగాని ఆ వెలుగై
౯ యుండలేదు. లోకమందు ప్రవేశించి ప్రతి మను
ష్యునిన్ని ప్రకాశింపచేసే నిజమైన వెలుగై ఆయన
౧౦ యుండెను. ఆయన లోకమందు వుండెను. లోక
౧౧ ము ఆయనవల్ల చేయబడెను. లోకము ఆయనను
తెలుసుకొన లేదు. ఆయన స్వకీయుల యొద్దికి
వచ్చెను అప్పుడు స్వకీయులు ఆయనను అంగీక
౧౨ రించలేదు. అయితే ఆయనను అంగీకరించిన వా
రెందరో వారికి—అనగా ఆయన నామమందు
విశ్వసించిన వారికి ఆయన దేవుని పిల్లలవుటకు అధి
౧౩ కారము‡ దయచేసెను. వారు రక్తము వల్లనైనా
మాంసపు యిచ్ఛవల్లనైనా మనుష్యుని యిచ్ఛవల్ల
౧౪ నైనా కాకుండా దేవునివల్ల పుట్టిరి. మరిన్ని ఆ
వాక్యము మాంసమై పుట్టి మనలో నివసించెను.
అప్పుడు తండ్రినుంచి జనితైకుని§ మహిమవలె
కృపతోనున్ను సత్యముతోనున్ను నిండుకొనిన
ఆయన మహిమను చూచితిమి.
౧౫ యోహాను ఆయనను గురించి సాక్ష్యమిస్తు
న్నాడు. ఆయన కంఠమెత్తి పలికినదేమంటే—నా
వెనుక వచ్చేవాడు నాకంటే ప్రథముడై యుండె
ను గనుక నాకంటే ముఖ్యుడాయెనని నేను చెప్పిన
వాడు యీయనే. ఆయనయొక్క పరిపూర్ణత ౧౬
నుంచి మనమందరము కృపకు కృపను పొందియు
న్నాము యెందుకంటే ఆజ్ఞాప్రమాణము మోశేవల్ల ౧౭
యివ్వబడెను కృపయున్ను సత్యమున్ను యేసుక్రీ
స్తువల్ల కలిగెను. ఎవడున్ను యెప్పుడైనా దేవుని ౧౮
చూడలేదు—తండ్రియొక్క రొమ్ముమీద వున్న జని
తైక కుమారుడైన యీయనే ఆయనను బయిలు
పరిచెను.

నీవు యెవడవని అడుగుటకు యూదులు యె ౧౯
రూశలేమునుంచి యాజకులనున్ను లేవీయులనున్ను
యోహాను యొద్దికి పంపినప్పుడు ఆయన సాక్ష్యము
యిదే. అప్పుడు ఆయన వొప్పుకొని యెరగనన ౨౦
లేదు—నేను క్రీస్తును కానని వొప్పుకొనెను. మరిన్ని ౨౧
వారు—ఆలాగైతే యేమిటి నీవు ఏలీయావా అని
అడిగినప్పుడు కానని చెప్పెను. నీవు ఆ ప్రవ ౨౨
క్తవా అంటే కానని ప్రత్యుత్తరమిచ్చెను. కాబట్టి
వారు—నీవు యెవడవు మమ్మును పంపిన వారికి
మేము ప్రత్యుత్తరమిచ్చే నిమిత్తము నిన్ను గురించి
నీవు యేమి చెప్పుకొంటున్నావని ఆయనతో పలి
కిరి. అప్పుడు ఆయన—ప్రవక్తయైన యెషయా ౨౩
చెప్పిన ప్రకారముగా నేను—ప్రభువుయొక్క తోవ
సరాళము చేయండి అని అరణ్యములో కంఠమెత్తి
పలికే వొకని శబ్దమునని చెప్పెను. పంపబడిన ౨౪
వారు ఫరిసైయులై యుండిరి. అప్పుడు వారు— ౨౫
నీవు క్రీస్తువైనా ఆ ప్రవక్తవైనా ఏలీయావైనా కాక
పోతే యెందుకు స్నానమిస్తున్నావని ఆయనను
అడిగిరి. యోహాను—నేను నీళ్లతో స్నానమిస్తు
న్నాను. అయితే మీరు యెరుగని వాడు మీ ౨౬
మధ్యను నిలిచియున్నాడు. నా వెనుక వస్తూ వుం ౨౭
డిన్ని నాకంటే ముఖ్యుడైన వాడు యీయనే.

* లేక, ఆయన. † లేక, ఆయనలో. ‡ లేక, శక్తి. § అనగా, యేకముగా పుట్టిన వాని.

నేను ఆయన చెప్పుల వారు విప్పుటకు పాత్రుడను
౨౮ కానని చెప్పి వారికి ప్రత్యుత్తరమిచ్చెను. యో
హాను స్నానమిస్తూ వున్న యొర్దాను అవతల
వున్న బేతబారాలో యివి జరిగెను.
౨౯ మరునాడు యోహాను యేసు తన యొద్దికి
వచ్చుట చూచి—ఇదుగో లోకముయొక్క పాప
౩౦ మును మోసుకొనిపోయే దేవుని గొర్రెపిల్ల! నా
వెంబడి వొక మనుష్యుడు వస్తున్నాడు ఆయన నా
కంటే ప్రథముడై యుండెను గనుక నాకంటే
ముఖ్యుడాయెనని నేను యెవని గురించి చెప్పితినో
౩౧ ఆయనే యీయన. నేను ఆయనను తెలుసుకొన
లేదు అయినప్పటికిన్ని ఆయన ఇశ్రాయేలుకు అగు
పరచబడేకొరకు నేను వచ్చి నీళ్లతో స్నానమిస్తూ
వుంటినని చెప్పెను.
౩౨ మరిన్ని యోహాను సాక్ష్యమిస్తూ—ఆత్మ పావు
రము వలె ఆకాశము నుంచి దిగుట చూచితిని
౩౩ అప్పుడు అది ఆయన మీద నిలిచెను. నేను ఆ
యనను యెరగనైతిని అయినప్పటికిన్ని నీళ్లతో
స్నానమిచ్చుటకు నన్ను పంపిన వాడు—నీవు ఆత్మ
యెవని మీదికి దిగి ఆయనమీద నిలిచి యుండుట
చూతువో ఆయనే పరిశుద్ధాత్మతో స్నానమిస్తున్న
౩౪ వాడని నాతో చెప్పెను. అప్పుడు నేను చూచి—
ఈయన దేవుని కుమారుడై యున్నాడని సాక్ష్య
మిచ్చి యున్నానని పలికెను.
౩౫ మరునాడు యోహాను తిరిగీ తన శిష్యులలో
యిద్దరితో కూడా నిలిచి నడుస్తూ వున్న యేసు
౩౬ తట్టు చూచి—ఇదుగో దేవుని గొర్రెపిల్ల! అని
౩౭ చెప్పెను. ఆ యిద్దరు శిష్యులు ఆయన చెప్పుట
౩౮ విని యేసును వెంబడించిరి. అంతట యేసు
వెనుక తట్టు తిరిగి వారు తన్ను వెంబడించుట
చూచి—మీరు యేమి వెతుకుతున్నారని వారితో
పలికినప్పుడు వారు భాషాంతరమందు బోధకుడా
అనే అర్థమిచ్చే—రబ్బీ యెక్కడ కాపురమున్నా
వని ఆయనతో పలికిరి. ఆయన—వచ్చి చూడుం
౩౯ డని వారితో చెప్పెను. వారు వచ్చి ఆయన
కాపురమున్న స్థలము చూచి ఆ దినమున ఆయన
యొద్ద నిలిచిరి. అప్పుడు కొంచెము యెక్కువ
౪౦ తక్కువ పదిఘంటలైనవి.* యోహాను మాట విని
ఆయనను వెంబడించిన యిద్దరిలో వొకడు సీమోను
పేతురు యొక్క సహోదరుడైన అంద్రెయ అనే
౪౧ వాడు. ఈయన మొదట సీమోననే తన సహో
దరుని కనుగొని—మేము భాషాంతరమందు క్రీస్తనే
అర్థమిచ్చే మెస్సీయను కనుగొంటిమని ఆయ
నతో చెప్పి ఆయనను యేసు యొద్దికి తీసుకొని
వచ్చెను. యేసు ఆయన తట్టు చూచి—నీవు ౪౨
యోనా కుమారుడవైన సీమోనువు నీవు కేఫా అన
బడుదువని చెప్పెను. అది రాయి అనే అర్థ
మిస్తున్నది.
మరునాడు యేసు గలిలైయకు బయిలు వెళ్లు ౪౩
టకు యిచ్ఛయించెను. అప్పుడు ఫిలిప్పును చూ
చి—నన్ను వెంబడించుమని అతనితో చెప్పెను.
ఆ ఫిలిప్పు బేత్సైదా—అనగా అంద్రెయ పేతురు ౪౪
అనేవారి పట్టణపువాడై యుండెను. ఫిలిప్పు ౪౫
నథనయేలును కనుగొని—ఆజ్ఞాప్రమాణములో మో
శేయున్ను ప్రవక్తలున్ను యెవని గురించి వ్రాసిరో
వాని కనుగొంటిమి ఆయన యోశేఫు కుమారుడైన
యేసనే నజరెథువాడని ఆయనతో చెప్పెను. అం ౪౬
దుకు నథనయేలు—నజరెథులోనుంచి మంచిది యే
దైనా రాగలదా అని ఆయనతో పలికినప్పుడు—
వచ్చి చూడుమని ఫిలిప్పు ఆయనతో చెప్పెను.
యేసు నథనయేలు తనయొద్దికి వచ్చుట చూచి— ౪౭
ఇదుగో యథార్థముగా ఇశ్రాయేలీయుడు యీ
యనే. ఈయనయందు యే కపటమున్ను లేదని
అతని గురించి పలికెను. నథనయేలు—దేనివల్ల ౪౮
నన్ను యెరుగుదువని ఆయనతో పలికెను. యే
సు—ఫిలిప్పు నిన్ను పిలువక మునుపే నీవు అం
జూరపుచెట్టుకింద వున్నప్పుడు నిన్ను చూచితినని
అతనికి ప్రత్యుత్తరమిచ్చెను. నథనయేలు—రబ్బీ ౪౯
నీవు దేవుని కుమారుడవై యున్నావు నీవు ఇశ్రా
యేలు రాజువైయున్నావని ఆయనకు ప్రత్యుత్తర
మిచ్చెను. యేసు—ఆ యంజూరపు చెట్టుకింద ౫౦
నిన్ను చూచితినని నేను చెప్పినందున నమ్ముతున్నా
వా వీటికంటే గొప్పవాటిని చూతువని అతనికి ౫౧
ప్రత్యుత్తరమిచ్చెను. మరిన్ని ఆయన—ఇకమీదట
ఆకాశము తెరవబడుటయున్ను దేవుని దూతలు
మనుష్యకుమారుని మీద యెక్కుటయున్ను దిగుట
యున్ను చూతురని నిజమే నిజమే మీతో చెప్పు
తున్నానని అతనితో పలికెను.

## ౨ పర్వము.

మూడోదినమందు గలిలైయయొక్క కానా ౧
వూరిలో వొక వివాహము కలిగెను. యేసు తల్లి ౨
అక్కడ వుండెను. అయితే యేసున్ను ఆయన
శిష్యులున్ను ఆ వివాహమునకు పిలువబడిరి ద్రా ౩
క్షారసము తక్కువైనప్పుడు యేసు తల్లి—వారికి

* మధ్యాహ్నము మొదలుకొని ఘంటలు చూచుకొంటే యిది నాలుగో ఘంట.

౪ ద్రాక్షారసము లేదని ఆయనతో చెప్పెను. యేసు
ఆమెతో—ఓ స్త్రీ నీతో నాకేమి నా గడియ యిం
౫ కా రాలేదని చెప్పెను. ఆయన తల్లి—మీతో
ఆయన యేమి చెప్పునో దాని చేయండని పరిచా
౬ రకులతో చెప్పెను. యూదుల శుద్ధిప్రకారము
రెండేసి మూడేసి తూములు పట్టే ఆరు రాతికుండ
౭ లు అక్కడ వుంచబడియుండెను. యేసు—ఆ కుం
డలు నీళ్లతో నింపండని వారితో చెప్పినప్పుడు
౮ వారు వాటిని అంచుల మట్టుకు నింపిరి. అప్పుడు
ఆయన—మీరు యిప్పుడు ముంచుకొని విందు
ప్రధానియొద్దికి తీసుకొని వెళ్లండని వారితో చెప్పి
౯ నప్పుడు వారు తీసుకొని వెళ్లిరి. అయితే విందు
ప్రధాని ద్రాక్షారసముగా చేయబడిన ఆ నీటి
రుచి చూచినప్పుడు—అది యెక్కడనుంచి కలిగె
నో ఆయనకు తెలియకపోయెను. అయితే ఆ
నీళ్లు ముంచిన పరిచారకులకు తెలుసును. ఆ
౧౦ విందు ప్రధాని పెండ్లికుమారుని పిలిచి—ప్రతి
మనుష్యుడున్ను మొదట మంచి ద్రాక్షారసమును
వుంచి తర్వాత వారు మత్తుగా వున్నప్పుడు అంత
కంటే చెడ్డదాని వుంచును. అయితే నీవు యిది
వరకు శ్రేష్ఠమైన ద్రాక్షారసమును వుంచుకొని
౧౧ యున్నావని ఆయనతో చెప్పెను. గలిలైయ
యొక్క కానాలో యేసు యీ మొదటి అద్భుత
ముచేసి తన మహిమను బయిలుపరిచెను. అప్పుడు
ఆయన శిష్యులు ఆయనయందు విశ్వాసముంచిరి.
౧౨ అటుతరువాత ఆయనయున్ను ఆయన తల్లిన్ని ఆ
యన సహోదరులున్ను ఆయన శిష్యులున్ను
కపెర్నహూముకు వెళ్లి అక్కడ కొన్ని దినములు
నిలిచిరి.
౧౩ యూదుల పస్ఖాఅనే పండుగ సమీపించినం
౧౪ దున యేసు యెరూశలేముకువెళ్లి గుడిలో యెడ్ల
నున్ను గొర్రెలనున్ను పావురములనున్ను అమ్మేవా
రున్ను రూకలు మార్చేవారున్ను కూర్చుని యుం
౧౫ డుటనున్ను చూచెను. అప్పుడు ఆయన తాళ్లతో
కొరడాచేసి అందరినిన్ని గొర్రెలనున్ను యెడ్లను
న్ను గుడిలోనుంచి తోలివేసి రూకలు మార్చే
వారి రూకలు చల్లివేసి వారి బల్లలు పడదోసి పావు
౧౬ రములను అమ్మే వారితో—వీటిని యిక్కడనుంచి
తీసుకొని వెళ్లండి నా తండ్రి యిల్లు వ్యాపారపు
౧౭ యిల్లుగా చేయ వద్దని చెప్పెను.—అయితే ఆయన
శిష్యులు—నీ యింటి ఆసక్తి నన్ను భక్షించెనని
వ్రాయబడి యున్నదని జ్ఞాపకము చేసుకొనిరి.
౧౮ కాబట్టి యూదులు—వీటిని చేస్తున్నావు గనుక
యే అద్భుతము మాకు చూపిస్తున్నావని ఆయనకు
ప్రత్యుత్తరమిచ్చినప్పుడు యేసు—ఈ దేవాలయ ౧౯
మును పడదోయండి అప్పుడు మూడు దినముల
లో దాని లేవనెత్తుదునని వారితో ప్రత్యుత్తరము
చెప్పెను. కాబట్టి యూదులు—నలుబదియారు ౨౦
సంవత్సరములు యీ దేవాలయము కట్టబడెను నీవు
మూడు దినములలో దాని లేవ నెత్తుదువా అని
పలికిరి. అయితే ఆయన తన శరీరమనే దేవాల ౨౧
యమును గురించి పలికెను. కాబట్టి ఆయన చని ౨౨
పోయిన వారిలోనుంచి లేచిన తరువాత ఆయన
శిష్యులు ఆయన దీని చెప్పెనని జ్ఞాపకము చేసు
కొని లేఖనమున్ను యేసు చెప్పిన మాటయున్ను
విశ్వసించిరి.
అయితే ఆయన పస్ఖాయందు యెరూశలేములో ౨౩
వున్నప్పుడు ఆ పండుగలో అనేకులు ఆయన
చేసిన అద్భుతములను చూచి ఆయన నామమందు
విశ్వాసముంచిరి. అయితే యేసు అందరినిన్ని ౨౪
యెరిగినందు చేతనున్ను మనుష్యుని యందు వుం
డేది ఆయనకు తెలుసును గనుక యెవడైనా మను ౨౫
ష్యుని గురించి సాక్ష్య మిచ్చుట ఆయనకు అక్కర
లేనందుచేతనున్ను తన్ను తాను వారికి అప్పగించు
కొన లేదు.

## ౩ పర్వము.

నికొదేమనే పేరుగల ఫరిసైయుడున్ను యూ ౧
దుల ప్రధానియున్నైన వొక మనుష్యుడు కలడు.
ఆయన రాత్రియందు యేసు యొద్దికి వచ్చి—ఓ ౨
రబ్బీ నీవు దేవుని యొద్దనుంచి వచ్చిన బోధకుడవని
యెరుగుదుము యెందుకంటే దేవుడు ఆయనకు
తోడైయుంటేనే గాని యే మనుష్యుడున్ను నీవు
చేస్తున్న అద్భుతములను చేయ నేరడని ఆయనతో
చెప్పెను. యేసు—యెవడైనా తిరిగీ పుట్టితేనే ౩
గాని దేవుని రాజ్యమును చూడ నేరడని నిజమే
నిజమే నేను నీతో చెప్పుతున్నానని ఆయనకు
ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు నికొదేము—ముస ౪
లియైయున్న మనుష్యుడు యేలాగు పుట్టగలడు.
రెండో మారు తల్లి గర్భమందు ప్రవేశించి పుట్ట
గలడా అని ఆయనతో పలికినప్పుడు యేసు—నిజ ౫
మే నిజమే నేను నీతో చెప్పేది యేలాగంటే యెవ
డైనా నీళ్లవల్లనున్ను ఆత్మవల్లనున్ను పుట్టితేనే గాని
దేవుని రాజ్యమందు ప్రవేశించ నేరడు. మాంస ౬
మువల్ల పుట్టినది మాంసమున్ను ఆత్మవల్ల పుట్టినది
ఆత్మయున్నై యున్నది. మీరు తిరిగీ పుట్టవలె ౭
నని నేను నీతో చెప్పినందుకు ఆశ్చర్యపడవద్దు.

౮ గాలి తనకు యిచ్ఛ గల చోటను విసురుతున్నది
నీవు దాని శబ్దము వింటున్నావు అయితే అది
యెక్కడనుంచి వచ్చునో యెక్కడికి పోవునో
నీకు తెలియదు. ఆత్మవల్ల పుట్టిన ప్రతివాడున్ను
౯ ఆలాగే వున్నాడని ప్రత్యుత్తరమిచ్చెను. ఇవి
యేలాగు సంభవించ గలవని నికొదేము ఆయనతో
౧౦ ప్రత్యుత్తరము పలికెను. అందుకు యేసు—నీవు
ఇశ్రాయేలు బోధకుడవైయున్ని వీటిని యెరుగవా
౧౧ నిజమే నిజమే నేను నీతో చెప్పేది యేలాగంటే—
మాకు తెలిసినదాని పలుకుతున్నాము చూచినదానికి
సాక్ష్యమిస్తున్నాము మా సాక్ష్యము మీరు అంగీ
౧౨ కరించరు. భూ సంబంధమైన వాటిని నేను మీతో
చెప్పినప్పుడు మీరు నమ్మని పక్షమందు ఆకాశ
సంబంధమైన వాటిని మీతో పలికితే యేలాగు
౧౩ నమ్ముదురు. మరిన్ని ఆకాశమునుంచి దిగిన వాడే—
అనగా ఆకాశములో వున్న మనుష్యకుమారుడే
గాని ఆకాశములోకి యెవడున్ను యెక్కి వెళ్ల
౧౪ లేదు. అదిన్ని గాక అరణ్యములో మోశే సర్ప
౧౫ మును యేలాగున యెత్తెనో ఆలాగున మనుష్య
కుమారుడు ఆయన యందు విశ్వాసముంచే ప్రతి
వాడున్ను నశించక నిత్య జీవము పొందే కొరకు
౧౬ యెత్తబడ వలెను యెందుకంటే దేవుడు లోకము
ప్రేమించుట యేలాగంటే—ఆయన యందు విశ్వా
సముంచే ప్రతివాడున్ను నశించక నిత్యజీవము
పొందేకొరకు తన జనితైక కుమారుని యిచ్చెను
౧౭ యెందుకంటే దేవుడు లోకమునకు తీర్పుచేయు
టకు తన కుమారుని లోకమునకు పంప లేదు అయితే
లోకము ఆయన ద్వారా రక్షణ పొందుటకే.
౧౮ ఆయనయందు విశ్వాసముంచేవానికి తీర్పు చేయ
బడదు. అయితే విశ్వసించని వానికి యింతకు
మునుపే తీర్పుచేయబడి యున్నది యెందుకంటే
దేవుని జనితైక కుమారుని నామమందు విశ్వాస
౧౯ ముంచలేదు. ఆ తీర్పు యేదంటే వెలుగు లోకము
లోకి వచ్చెను అయితే మనుష్యులు తమ క్రియలు
చెడ్డవైనందున వెలుగుకంటే చీకటిని బహుగా
౨౦ ప్రేమించిరి యెందుకంటే చెడ్డ క్రియలు చేసే ప్రతి
వానికిన్ని వెలుగు అసహ్యమై యున్నది. వాడు
తన క్రియలు గద్దించబడక వుండే కొరకు వెలుగు
౨౧ యొద్దికి రాడు. అయితే సత్యమును జరిగించే
వాడు తన క్రియలు దేవుని మూలముగా చేయబడి
యున్నవని అగుపడే నిమిత్తము వెలుగు యొద్దికి
వస్తున్నాడని ఆయనతో ప్రత్యుత్తరము చెప్పెను.

అటుతరువాత యేసు తన శిష్యులతో కూడా ౨౨
యూదయ దేశమునకు వచ్చి అక్కడ వారిలో
నివసించి స్నానమిస్తూ వుండెను. అయితే యో ౨౩
హాను కూడా సలేము దగ్గిర వున్న ఐనోనులో
స్నానమిస్తూ వుండెను యెందుకంటే అక్కడ నీళ్లు
విస్తారముగా వుండెను. వారు వచ్చి స్నానము
పొందుతూ వుండిరి యెందుకంటే యోహాను యిం ౨౪
కా చెరసాలలో వేయబడ లేదు. కాబట్టి శుద్ధిని ౨౫
గురించి యోహాను శిష్యులకున్ను యూదులకున్ను
వివాదము పుట్టెను. అప్పుడు వారు యోహాను ౨౬
యొద్దికి వచ్చి—రబ్బీ యెవడు యొర్దాను అవతల
నీతో కూడా వుండెనో నీవు యెవని గురించి
సాక్ష్యమిచ్చితివో యిదుగో ఆయన స్నానమిస్తు
న్నాడు మరిన్ని అందరున్ను ఆయన యొద్దికి వస్తు
న్నారని ఆయనతో చెప్పిరి. అందుకు యోహాను ౨౭
ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే—మనుష్యుడు
తనకు ఆకాశమునుంచి యివ్వబడినదైతేనే గాని
యేమిన్ని పుచ్చుకొనలేడు. నేను క్రీస్తును కాన ౨౮
నిన్ని అయితే ఆయనకంటే ముందుగా పంపబడి
యున్నానని చెప్పినానను టకు మీరున్ను నాకు
సాక్షులై యున్నారు. పెండ్లి కొమార్తె గల ౨౯
వాడు పెండ్లి కుమారుడై యున్నాడు. అయితే
నిలువబడి పెండ్లి కుమారుని శబ్దము వినే వాని
స్నేహితుడు ఆ పెండ్లికుమారుని శబ్దమువల్ల మిక్కిలీ
సంతోషించును. కాబట్టి యీ నా సంతోషము
సంపూర్ణమై యున్నది. ఆయన హెచ్చవలెను ౩౦
నేను తగ్గ వలెను. మీదనుంచి వచ్చే వాడు అం ౩౧
దరి మీద వున్నాడు. భూమినుంచి పుట్టేవాడు
భూ సంబంధియై యుండి భూమిని గురించి మాట్లా
డుతున్నాడు. ఆకాశమునుంచి వచ్చే వాడు అం
దరి మీదనుండి తాను చూచే దాని గురించిన్ని వినే ౩౨
దాని గురించిన్ని సాక్ష్యమిస్తున్నాడు. అయితే
యెవడున్ను ఆయన సాక్ష్యమును అంగీకరించడు.
ఆయన సాక్ష్యమును అంగీకరించేవాడు—దేవుడు ౩౩
సత్యవంతుడని ముద్రవేసి యున్నాడు యెందు ౩౪
కంటే దేవుడు పంపిన వాడు దేవుని మాటలు పలు
కుతున్నాడు యెందుకంటే దేవుడు మితివల్ల ఆత్మను
యివ్వడు. తండ్రి కుమారుని ప్రేమించి ఆయన ౩౫
చేతికి సమస్తమున్ను యిచ్చెను. ఆ కుమారుని ౩౬
యందు విశ్వాసముంచే వానికి నిత్య జీవము కలదు
కుమారుని విశ్వసించని* వాడు జీవమును చూడడు
అయితే దేవుని వుగ్రము వాని మీద నిలుచును.

* లేక, కుమారునికి విధేయుడు కాని.

## ౪ పర్వము.

కాబట్టి యోహానుకంటే యేసు అనేకులను
శిష్యులుగా చేసుకొని వారికి స్నానమిస్తూ వున్నట్టు
ఫరిసైయులు విన్నారని ప్రభువుకు తెలిసినప్పుడు—
౨ అయినప్పటికిన్ని ఆయన శిష్యులేగాని యేసు తానే
౩ స్నానమివ్వలేదు—ఆయన యూదైయను విడిచి
౪ గలిలైయకు తిరిగీ వెళ్లెను. అయితే ఆయన సమ
౫ రైయ ద్వారా వెళ్ల వలసి యుండెను గనుక యా
కోబు యోశేఫుకు యిచ్చిన భూమి దగ్గిర వున్న
సుఖారనబడిన సమరైయ దేశపు వూరికి వచ్చెను.
౬ అక్కడ యాకోబుయొక్క నుయ్యి వుండెను. కా
బట్టి యేసు ప్రయాణమువల్ల అలసటపడి యీలాగు
ఆ నూతి యొద్ద కూర్చుంటూ వుండెను. అప్ప
టికి కొంచెము యెక్కువ తక్కువ ఆరుఘంట
లైనవి.*
౭ సమరైయ దేశపు స్త్రీ వొకతె నీళ్లు తోడుటకు
వచ్చెను. యేసు—నాకు తాగుటకు యిమ్మని ఆమె
౮ తో చెప్పెను యెందుకంటే ఆయన శిష్యులు ఆహా
౯ రము కొనే కొరకు వూరికి వెళ్లియుండిరి. కాబట్టి
ఆ సమరైయురాలయిన స్త్రీ—నీవు యూదుడవై
యుండి సమరైయ దేశపు స్త్రీనైన నన్ను తాగు
టకు యిమ్మని యేల అడుగుతున్నావని ఆయనతో
పలికెను యెందుకంటే యూదులు సమరైయులతో
౧౦ సాంగత్యము చేయరు. అందుకు యేసు—నీవు
దేవుని వరమున్ను నాకు తాగుటకు యిమ్మని నీతో
యెవడు చెప్పుతున్నాడో అదిన్ని యెరిగి యుంటే
నీవు ఆయనను అడిగి యుందువు అప్పుడు ఆయన
జీవముగల నీళ్లు నీకు యిచ్చి యుండునని ఆమెకు
౧౧ ప్రత్యుత్తరము చెప్పినప్పుడు ఆ స్త్రీ—ప్రభువా
నీకు చేదయైనా లేదు మరిన్ని నుయ్యి లోతై యు
న్నది గనుక దేనివల్ల ఆ జీవము గల నీళ్లు నీకు
౧౨ కలవు. ఈ నుయ్యి మాకు యిచ్చి తన కుమాళ్లి
తోనున్ను పశ్వాదులతోనున్ను తాను కూడా దాని
నీళ్లు తాగిన మన † తండ్రియైన యాకోబుకంటే
నీవు గొప్పవాడవా అని ఆయనతో పలికెను.
౧౩ అందుకు యేసు—ఈ నీళ్లు తాగే ప్రతివానికిన్ని
౧౪ తిరిగీ దాహమవును. అయితే నేను యిచ్చే నీళ్లు
యెవడు తాగునో వానికి యెప్పుడున్ను దాహము
కాకుండా నేను వానికి యిచ్చే నీళ్లు నిత్యజీవము
నకు వూరే నీటి బుగ్గయై యుండునని ఆమెకు
ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు ఆ స్త్రీ—ఓ ప్రభు ౧౫
వా నాకు దాహము కాకనున్న నేను చేదుటకు
యిక్కడికి రాకనున్న వుండే కొరకు ఆ నీళ్లు
నాకు దయచేయుమని ఆయనతో చెప్పెను. అ ౧౬
ప్పుడు యేసు—నీవు వెళ్లి నీ పెనిమిటిని పిలుచు
కొని యిక్కడికి రమ్మని ఆమెతో చెప్పెను. అం ౧౭
దుకు ఆ స్త్రీ—నాకు పెనిమిటి లేడని ప్రత్యుత్తర
మిచ్చెను. యేసు—నాకు పెనిమిటి లేడని నిజ
ముగా చెప్పితివి యెందుకంటే నీకు అయిదుగురు ౧౮
పెనిమిట్లు వుండిరి. ఇప్పుడు నీకు కలిగిన వాడు
నీ పెనిమిటి కాడు దీని నిజముగా చెప్పితివని ఆమె
తో పలికినప్పుడు ఆ స్త్రీ—ఓ ప్రభువా నీవు ప్రవ ౧౯
క్తవని చూస్తున్నాను. మా పితృలు యీ పర్వత ౨౦
మందు ఆరాధించిరి. అయితే ఆరాధన చేయవల
సిన స్థలము యెరూశలేములో వున్నదని మీరు చెప్పు
దురని ఆయనతో పలికెను. అందుకు యేసు— ౨౧
ఓ స్త్రీ మీరు యీ పర్వతమందున్ను యెరూశలేము
యందున్ను మాత్రమే కాకుండా తండ్రిని ఆరా
ధించే కాలము వచ్చునని నా మాట నమ్ముము.
మీరు మీకు తెలియని దాని ఆరాధిస్తున్నారు. ౨౨
మేము మాకు తెలిసిన దాని ఆరాధిస్తున్నాము యెం
దుకంటే రక్షణ యూదులలోనుంచి కలుగును.
అయితే నిజమైన ఆరాధికులు ఆత్మతోనున్ను సత్య ౨౩
ముతోనున్ను తండ్రిని ఆరాధించే కాలము వస్తు
న్నది యిప్పుడున్ను వున్నది యెందుకంటే తండ్రి
తన్ను ఆరాధించే వారు అటువంటి వారవుటకు
వెతుకుతున్నాడు. దేవుడు ఆత్మ గనుక ఆయనను ౨౪
ఆరాధించే వారు ఆత్మతోనున్ను సత్యముతోనున్ను
ఆరాధించ వలెనని ఆమెతో చెప్పెను. ఆ స్త్రీ— ౨౫
క్రీస్తనే అర్థమిచ్చే మెస్సియా వచ్చునని యెరు
గుదును ఆయన వచ్చినప్పుడు మాకు సమస్తమున్ను
తెలియచేసునని ఆయనతో పలికెను. అందుకు ౨౬
యేసు—నీతో పలుకుతూ వున్న నేనే ఆయనని
ఆమెతో చెప్పెను.

ఇంతలో ఆయన శిష్యులు వచ్చి ఆయన స్త్రీ తో ౨౭
పలుకుతూ వుండెనని ఆశ్చర్యపడిరి. అయినప్ప
టికిన్ని—నీవు దేని వెతుకుతున్నావు యీమెతో
యెందుకు మాట్లాడుతున్నావని యెవడున్ను పలు
కలేదు.

* అనగా, యూదుల లెక్కచొప్పున మధ్యాహ్నము. † లేక, మా.

౨౮ కాబట్టి ఆ స్త్రీ తన కుండ విడిచి వూరిలోకి
౨౯ వెళ్లి—ఇదుగో నేను చేసినవన్నిన్ని నాతో చెప్పిన
వొక మనుష్యుని చూడ రండి యీయన క్రీస్తుకా
౩౦ డా అని జనులతో చెప్పెను. వారు వూరిలో
నుంచి బయిలుదేరి ఆయనయొద్దికి వస్తూవుండిరి.
౩౧ ఆ మధ్యను శిష్యులు—ఓ రబ్బీ భుజించుమని
౩౨ ఆయనను వేడుకొనిరి. అయితే ఆయన—నేను
భుజించుటకు మీకు తెలియని ఆహారము నాకు
౩౩ కలదని వారితో చెప్పెను. కాబట్టి ఆ శిష్యులు
వొకనితోవొకడు—ఆయన భుజించుటకు యెవడై
నా యేమైనా తెచ్చినాడేమో అని అనుకొనిరి.
౩౪ యేసు వారితో చెప్పినదేమంటే—నన్ను పంపినవాని
యిచ్ఛ నెరవేర్చుటయున్ను ఆయన పని సంపూ
ర్తి చేసుటయున్ను నా ఆహారమై యున్నది.
౩౫ ఇంకా నాలుగు నెలలైన తరువాత కోతకాలము
వచ్చునని మీరు చెప్పుతున్నారుగదా యిదుగో
మీ కన్నులెత్తి పొలములను చూడండి అవి యి
ప్పుడే తెల్లబడి కోతకు సిద్ధమైయున్నవని మీతో
౩౬ చెప్పుతున్నాను. మరిన్ని విత్తేవాడున్ను కోసేవా
డున్ను కూడా సంతోషించేటట్టు చేను కోసేవాడు
జీతము పుచ్చుకొని నిత్యజీవముకొరకు ఫలము కూ
౩౭ ర్చుకొంటున్నాడు యెందుకంటే—వొకడు విత్తు
ను మరియొకడు కోసుననే మాట యిందులో సత్య
౩౮ మే. మీరు దేని గురించి కష్టపడలేదో అది
కోసుటకు మిమ్మును పంపితిని. ఇతరులు కష్టప
డిరి మీరు వారి కష్ట ఫలములలో ప్రవేశించితిరని
పలికెను.
౩౯ మరిన్ని—నేను చేసినవి యేవో అవి యన్నిన్ని
నాతో చెప్పెనని సాక్ష్యమిచ్చిన స్త్రీ యొక్క మా
టవల్ల ఆ పట్టణస్థులైన సమరైయులలో అనేకులు
౪౦ ఆయనయందు విశ్వాసముంచిరి. కాబట్టి ఆ సమ
రైయులు ఆయనయొద్దికి వచ్చి తమయొద్ద నిలుచు
టకు ఆయనను వేడుకొనిరి. అక్కడ ఆయన
౪౧ రెండు దినములు నిలిచెను. అప్పుడు ఆయన వా
క్యమువల్ల యింకా అనేకులు నమ్మి—ఇకమీదట
౪౨ నీవు పలికిన దానివల్ల నమ్ముతున్నాముకాము యెం
దుకంటే మేముకూడా విని యీయన నిశ్చయము
గా లోకరక్షకుడైన క్రీస్తని యెరుగుదుమని ఆ
స్త్రీతో చెప్పిరి.
౪౩ ఆ రెండు దినములైన తరువాత ఆయన అక్కడ
౪౪ నుంచి బయిలుదేరి గలిలైయకు వెళ్లెను యెందుకం
టే—ప్రవక్త తన స్వదేశములో ఘనము పొందడని
౪౫ యేసు చెప్పియుండెను. కాబట్టి ఆయన గలి
లైయకు వచ్చినప్పుడు గలిలైయులు ఆయన యెరూ
శలేములో పండుగ వేళ చేసినవన్నిన్ని చూచినం
దున ఆయనను చేర్చుకొనిరి యెందుకంటే వారు
కూడా ఆ పండుగకు వెళ్లిరి.
కాబట్టి యేసు తాను నీళ్లు ద్రాక్షారసముగా ౪౬
చేసిన గలిలైయలోవున్న కానానుకు తిరిగి వచ్చెను.
అప్పుడు కపెర్నహూములో రోగియైన కుమారు
డుగల వొక ప్రధాని యుండెను. యేసు యూ ౪౭
దైయనుంచి గలిలైయకు వచ్చెనని అతడు వినినప్పు
డు ఆయనయొద్దికి వెళ్లి ఆయన వచ్చి తన కుమా
రుని స్వస్థపరుచుటకు వేడుకొనెను యెందుకంటే
అతడు మృతి పొందనై యుండెను. కాబట్టి ౪౮
యేసు—మీరు గురుతులనున్ను అద్భుతములనున్ను
చూడకపోతే నమ్మనే నమ్మరని ఆయనతో చెప్పెను.
ఆ ప్రధాని—ఓ ప్రభువా నాపిల్ల చావక మునుపే ౪౯
రమ్మని ఆయనతో చెప్పెను. యేసు—నీవు వెళ్లు ౫౦
ము నీ కుమారుడు బ్రతుకుతున్నాడని ఆయనతో
చెప్పెను. ఆ మనుష్యుడు యేసు తనతో చెప్పిన
మాట నమ్మి వెళ్లిపోయెను. మరిన్ని ఆయన యిం ౫౧
కా వెళ్లుతూ వున్నప్పుడు ఆయన దాసులు ఆయ
నకు యెదురుగా వచ్చి—నీ కుమారుడు బ్రతుకుతు
న్నాడని తెలియ చెప్పిరి. కాబట్టి అతనికి యే ౫౨
గడియలో స్వస్థత కలిగెనో దాని గురించి వారిని
అడిగినప్పుడు వారు—నిన్న యేడో గడియను జ్వర
ము అతని విడిచెనని ఆయనతో చెప్పిరి. యేసు ౫౩
తనతో—నీ కుమారుడు బ్రతుకుతున్నాడని చెప్పిన
గడియ అదే అని తండ్రి తెలుసుకొనెను గనుక
ఆయనయున్ను ఆయన యింటివారందరున్ను నమ్మిరి.
యేసు యూదైయనుంచి గలిలైయకు వచ్చి చేసిన ౫౪
రెండో అద్భుతము యిదే.

## ౫ పర్వము.

ఇవియైన తరువాత యూదుల పండుగ వొకటి ౧
వుండెను గనుక యేసు యెరూశలేముకు వెళ్లెను.
యెరూశలేములో గొర్రె ద్వారము దగ్గిర హెబ్రా ౨
యి భాషలో బేథెస్ద అనబడిన వొక కోనేరు కలదు
దానికి అయిదు మంటపములున్నవి. వాటిలో ౩
బహు విస్తారమైన బలహీనులున్ను గుడ్డివారున్ను
కుంటివారున్ను యెండిన వారున్ను పండుకొనిరి
వారు నీళ్లు చలించుటకు కనిపెట్టుతూ వుండిరి
యెందుకంటే వొక దూత వొకానొకప్పుడు ఆ ౪
కోనేటిలో ప్రవేశించి నీళ్లు కలగేటట్టుచేసెను గ
నుక నీళ్లు కలగిన తరువాత మొదట ప్రవేశించిన ౫
వాడు తనకు యే రోగము కలిగినప్పటికీ స్వస్థత

పొందెను అక్కడ ముప్పయి యెనిమిది సంవత్సర
ములనుంచి రోగము కలిగిన వొక మనుష్యుడు
౬ వుండెను. అతడు పండుకొని యుండుట యేసు
చూచి అతడు అప్పటికి బహు కాలమునుంచి ఆ
స్థితిలో వున్నాడని యెరిగి స్వస్థపడుటకు కోరుతు
౭ న్నావా అని అతనితో పలికినప్పుడు ఆ రోగి—
ఓ ప్రభువా నీళ్లు కలగించబడేటప్పుడు నన్ను
కోనేటిలో వుంచే కొరకు నాకు యే మనుష్యుడున్ను
లేడు అయితే నేను వస్తూ వున్నప్పుడు మరియొ
కడు నాకంటే ముందుగా దిగునని ఆయనకు ప్ర
౮ త్యుత్తరమిచ్చెను. అప్పుడు యేసు—నీవులేచి నీ
పరుపు యెత్తుకొని నడువుమని అతనితో చెప్పెను.
౯ వెంటనే ఆ మనుష్యుడు స్వస్థత పొంది తన పరుపు
యెత్తుకొని నడిచెను.
౧౦ అయితే ఆ దినమందు సబ్బాతు వుండెను గనుక
యూదులు—సబ్బాతు వున్నది నీ పరుపు యెత్తు
౧౧ కొనుట నీకు తగదని స్వస్థత పొందిన వానితో చె
ప్పిరి. అతడు—నన్ను స్వస్థపరిచిన వాడే—నీ పరు
పు యెత్తుకొని నడువుమని నాతో చెప్పెనని వారికి
౧౨ ప్రత్యుత్తరమిచ్చెను. కాబట్టి వారు—నీ పరుపు
యెత్తుకొని నడువుమని నీతో చెప్పిన మనుష్యుడు
౧౩ యెక్కడ వున్నాడని అతని అడిగిరి. అయితే
ఆయన యెవడో స్వస్థత పొందిన వానికి తెలియక
పోయెను యెందుకంటే ఆ చోటను సమూహము
౧౪ వుండెను గనుక యేసు జారిపోయెను. ఆ తరు
వాత యేసు గుడిలో అతని చూచి—యిదుగో నీవు
స్వస్థత పొందితివి మరీ యెక్కువ కీడు నీకు కలు
గక వుండే కొరకు యికమీదట పాపము చేయకు
౧౫ మని చెప్పెను. ఆ మనుష్యుడు వెళ్లి తన్ను స్వస్థ
పరిచిన వాడు యేసని యూదులకు తెలిపెను.
౧౬ కాబట్టి వీటిని సబ్బాతులో చేసినందున యూదు
లు యేసును తరిమి ఆయనను చంపుటకు వెతికిరి.
౧౭ అయితే యేసు—నా తండ్రి యిది వరకు క్రియ
జరిగిస్తున్నాడు నేనున్ను జరిగిస్తున్నానని వారికి
౧౮ ప్రత్యుత్తరమిచ్చెను. కాబట్టి యూదులు దీని
వల్ల మరీ యెక్కువగా ఆయనను చంపుటకు యత్న
పడిరి యెందుకంటే ఆయన సబ్బాతు వదులుట
మాత్రమే కాదు అయితే తన్ను దేవునితో సమా
నునిగా చేసుకొని దేవుడు తన స్వకీయమైన తండ్రి
అని చెప్పెను.
౧౯ కాబట్టి యేసు—నిజమే నిజమే నేను మీతో
చెప్పేది యేదంటే కుమారుడు తండ్రి దేని చేయుట
చూచునో అదే గాని తనంతట తాను యేదిన్ని
చేయ నేరదు యెందుకంటే ఆయన వేటిని చేసు
నో వాటిని కుమారుడున్ను ఆలాగు చేసును యెం ౨౦
దుకంటే తండ్రి కుమారుని ప్రేమిస్తూ తాను చేసే
వాటినన్నిటినిన్ని ఆయనకు అగుపరుస్తున్నాడు.
మరిన్ని మీరు ఆశ్చర్యపడే కొరకు వీటికంటే గొప్ప
కార్యములను ఆయనకు అగుపరుచును యెందుకం ౨౧
టే తండ్రి యేలాగు మృతులను లేపి బ్రతికించు
నో ఆలాగే కుమారుడు కూడా తాను యిచ్ఛ
యించే వారిని బ్రతికించును. అంతే కాకుండా ౨౨
తండ్రి యెవనికిన్ని తీర్పు చేయడు అయితే అం
దరున్ను తండ్రిని ఘనపరిచే ప్రకారము కుమారుని
ఘనపరిచే కొరకు తీర్పు చేయుట కేవలము కుమా
రునికి అప్పగించెను. కుమారుని ఘనపరచని వా ౨౩
డు ఆయనను పంపిన తండ్రిని ఘనపరచడు.
నిజమే నిజమే నేను మీతో చెప్పేదేమంటే—నా ౨౪
వాక్యము విని నన్ను పంపిన వానియందు విశ్వాస
ముంచేవానికి నిత్యజీవము కలిగియున్నది. అతడు
తీర్పులోకి రాక మరణమునుంచి జీవములోకి
వచ్చియున్నాడు. నిజమే నిజమే మీతో చెప్పేది ౨౫
యేమంటే—మృతులు దేవుని కుమారుని శబ్దమును
వినేటటువంటిన్ని వినేవారు జీవించేటటువంటిన్ని
గడియ వస్తున్నది—అది యిప్పుడు కూడా వున్నది
యెందుకంటే తండ్రి యేలాగు తనంతట తానే ౨౬
జీవముగలవాడై యున్నాడో ఆలాగే కుమారునికి
న్ని తనంతట తానే జీవము కలుగుట యిచ్చి యు
న్నాడు. మరిన్ని ఆయన మనుష్యకుమారుడై యు ౨౭
న్నాడు గనుక తీర్పు చేయుటకున్ను ఆయనకు
అధికారము యిచ్చెను. దీనికి ఆశ్చర్యపడకండి ౨౮
యెందుకంటే సమాధులలో వున్న వారందరున్ను
ఆయన శబ్దమును విని—జీవముయొక్క పునరుత్థాన ౨౯
మునకు మంచి క్రియలు చేసినవారున్ను తీర్పు
యొక్క పునరుత్థానమునకు చెడ్డ క్రియలు చేసిన
వారున్ను బయిటికి వచ్చే వేళ వస్తున్నది. నా ౩౦
యంతట నేనే యేమిన్ని చేయలేను నేను వినే
ప్రకారము తీర్పు చేస్తున్నాను నన్ను పంపిన తండ్రి
యిచ్ఛనేగాని నా యిచ్ఛను నేను వెతుకను గనుక
నా తీర్పు న్యాయమైయున్నది. నన్ను గురించి ౩౧
నేనే సాక్ష్యమిచ్చినట్టయితే నా సాక్ష్యము సత్య
ము కాదు. నన్ను గురించి సాక్ష్యమిచ్చే వేరొక ౩౨
డు కలడు. మరిన్ని ఆయన నన్ను గురించి సా
క్ష్యమిచ్చే సాక్ష్యము సత్యమని యెరుగుదును.
మీరు యోహాను యొద్దికి కొందరిని పంపినప్పుడు ౩౩
ఆయన సత్యమునకు సాక్ష్యమిచ్చెను. అయితే ౩౪

మనుష్యులవల్ల (నా) సాక్ష్యమును పుచ్చుకొనను
అయినప్పటికిన్ని మీరు రక్షించబడే కొరకు వీటిని
౩౫ చెప్పుతున్నాను. ఆయన వెలిగించబడి ప్రకాశ
మైన దీపమై యుండెను. మీరు ఆయన వెలుగు
లోవుండి కొంత కాలము సంతోషించుటకు మన
౩౬ స్సుగలవారైతిరి. అయితే యోహాను సాక్ష్యము
కంటే నాకు యెక్కువైనది కలదు యెందుకంటే
నేను నెరవేర్చేకొరకు తండ్రి యే కార్యములను
నాకు యిచ్చెనో నేను చేస్తున్న ఆ కార్యములు
తండ్రి నన్ను పంపెనని నన్ను గురించి సాక్ష్యమి
౩౭ స్తున్నవి. మరిన్ని నన్ను పంపిన తండ్రి తాను
నన్ను గురించి సాక్ష్యమిచ్చి యున్నాడు. మీరు
యే కాలమందైనా ఆయన శబ్దము వినలేదు ఆయన
౩౮ రూపము చూడలేదు. మరిన్ని మీలో ఆయన
వాక్యము నిలిచి యుండలేదు యెందుకంటే ఆయన
యెవని పంపెనో ఆయనను మీరు విశ్వసించక
౩౯ వున్నారు. లేఖనములను పరిశోధిస్తున్నారు*
యెందుకంటే వాటివల్ల మీకు నిత్యజీవము కలిగి
యున్నదని తలంచుకొంటున్నారు—యివిన్ని నన్ను
౪౦ గురించి సాక్ష్యమిస్తున్నవి. అయితే మీకు జీవ
ము కలిగేకొరకు నాయొద్దికి వచ్చుటకు మీకు
౪౧ మనస్సులేదు. నేను మనుష్యులవల్ల మహిమను
౪౨ అంగీకరించను. అయితే దేవుని ప్రేమ మీలో
౪౩ లేదని మిమ్మును యెరుగుదును. నేను నా తండ్రి
నామమున వచ్చియున్నాను అయితే మీరు నన్ను
అంగీకరించరు మరియొకడు తన స్వకీయనామమున
౪౪ వచ్చినట్టయితే ఆయనను అంగీకరింతురు. వొక్క
డైన దేవునివల్ల వచ్చేఘనము† వెతుకక వొకనివల్ల
వొకడు ఘనము† పొందే మీరు యేలాగు విశ్వ
౪౫ సించ గలరు. నేను తండ్రియొద్ద మీ మీద
నేరము స్థాపింతునని తలంచకండి. మీరు ఆశ్ర
యించిన మోశే మీయందు నేరము స్థాపించే
౪౬ వాడు యెందుకంటే ఆయన నన్ను గురించి వ్రాసె
ను గనుక మీరు మోశేను నమ్మినట్టయితే నన్ను
౪౭ నమ్మియుందురు. అయితే ఆయన వ్రాతలను
నమ్మకపోతే నా మాటలను యేలాగు నమ్ముదురని
వారికి ప్రత్యుత్తరమిచ్చెను.

## ౬ పర్వము.

ఇవియైన పిమ్మట యేసు తిబెరియ సముద్రమనే
౨ గలిలైయ సముద్రము అవతలకు వెళ్లెను. అప్పుడు
బహు జనసమూహము ఆయనను వెంబడించెను
యెందుకంటే ఆయన రోగుల యెడల చేసిన అ
ద్భుతములను చూచిరి. అయితే యేసు పర్వత ౩
మెక్కి అక్కడ తన శిష్యులతో కూడా కూర్చుం
డెను. అప్పుడు యూదుల పండుగైన పస్కా సమీ ౪
పించెను. కాబట్టి యేసు కన్నులెత్తి బహు సమూ ౫
హము తన యొద్దికి వచ్చుట చూచి—వీరు భోజనము
చేసే కొరకు యెక్కడనుంచి రొట్టెలు కొని తే గల
మని ఫిలిప్పుతో పలికెను—అయితే తాను యేమి ౬
చేయనై యుండెనో అది తనకు తెలుసును గనుక
అతని శోధించుటకు దీని పలికెను. అందుకు ౭
ఫిలిప్పు—వారిలో ప్రతివాడున్ను కొంచెము కొంచె
ము పుచ్చుకొనే కొరకు యిన్నూరు దీనారముల‡
రొట్టెలు చాలవని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చెను.
ఆయన శిష్యులలో వొకడు అనగా సీమోను పేతురు ౮
సహోదరుడైన అంద్రెయ—ఇక్కడ వున్న వొక ౯
పడుచువానికి యవల రొట్టెలు అయిదున్ను రెండు
చిన్న చేపలున్ను కలిగి యున్నవి. అయితే యింత
మందికి యివి యే మాత్రమని ఆయనతో చెప్పెను
అయితే యేసు—మనుష్యులను కూర్చుండేటట్టు ౧౦
చేయండని చెప్పెను. అప్పుడు ఆ స్థలమందు
చాలా గడ్డి యుండెను గనుక లెక్కకు కొంచెము
యెక్కువ తక్కువ అయిదు వేల పురుషులు కూ
ర్చుండిరి. అప్పుడు యేసు ఆ రొట్టెలు పట్టు ౧౧
కొని స్తోత్రము§ చేసి వాటిని శిష్యులకు యిచ్చెను
శిష్యులు కూర్చుని యున్న వారికి వడ్డించిరి.
ఆలాగున చేపలు కూడా వారికి యిష్టమైనంత
మట్టుకు వడ్డించిరి. వారు తృప్తి పొందిన తరు ౧౨
వాత—యేమిన్ని నష్టపడకుండా మిగిలిన ముక్కలు
సమకూర్చండని తన శిష్యులతో చెప్పెను. కా ౧౩
బట్టి భోజనము చేసిన వారివల్ల మిగిలిన యవల
అయిదు రొట్టెల ముక్కలు సమకూర్చి పన్నెం
డు గంపలను నింపిరి.

కాబట్టి ఆ మనుష్యులు యేసు చేసిన అద్భు ౧౪
తము చూచి—నిజముగా యీ లోకమునకు రాగల
ప్రవక్త యీయనే అని పలుకుతూ వుండిరి. కా ౧౫
బట్టి యేసు తన్ను రాజును చేయుటకు వారు వచ్చి
తన్ను అపహరించనై యున్నారని యెరిగి తిరిగీ
పర్వతము మీదికి వొంటిగా వెళ్లెను.

మరిన్ని సాయంకాలమైనప్పుడు ఆయన శిష్యులు ౧౬
సముద్రము యొద్దికి వెళ్లి దోనె యెక్కి కపెర్న ౧౭

* లేక, పరిశోధించండి. † లేక, మెప్పు.

‡ దీనారమనగా—కొంచెము యెక్కువ తక్కువ అయిదణాలు. § లేక, ఆశీర్వదించి.

హూము తట్టు సముద్రము ఆవలికి వెళ్లుతూ వుం
డిరి. అప్పుడు చీకటాయెను అయితే యేసు వారి
౧౮ యొద్దికి వచ్చి యుండ లేదు. మరిన్ని పెద్ద గాలి
విసురుట వల్ల సముద్రము తెరెత్తుతూ వుండెను.
౧౯ కాబట్టి వారు కొంచెము యెక్కువ తక్కువ రెండు
కోసుల మట్టుకు దోనె నడిపించిన తరువాత సము
ద్రము మీద నడుస్తూ ఆ దోనె దగ్గెర వున్న యే
౨౦ సును చూచి భయపడిరి. అయితే ఆయన—నేనే
వున్నాను భయపడకండి అని వారితో చెప్పెను.
౨౧ కాబట్టి ఆయనను దోనె మీద యెక్కించుకొను
టకు యిచ్ఛయించిరి. వెంటనే ఆ దోనె వారు
వెళ్లుతూ వున్న దేశమందు చేరెను.
౨౨ మరునాడు సముద్రము అవతల నిలిచి యున్న
జనసమూహము ఆయన శిష్యులు యెక్కిన చిన్న
దోనె వొక్కటే గాక అక్కడ మరి యొకటి లేద
నిన్ని యేసు తన శిష్యులతో కూడా ఆ చిన్న దో
నెలో ప్రవేశించ లేదు గాని ఆయన శిష్యులు
౨౩ మాత్రము వెళ్లిరనిన్ని చూచి—అయినప్పటికిన్ని
ప్రభువు స్తోత్రము చేసినప్పుడు వారు రొట్టె భుజిం
చిన స్థలము దగ్గెర వున్న తిబెరియనుంచి వేరే చిన్న
౨౪ దోనెలు వచ్చెను—కాబట్టి యేసున్ను ఆయన శిష్యు
లున్ను అక్కడ లేరని జనసమూహము చూచిన
ప్పుడు వారు ఆ చిన్న దోనె యెక్కి కపెనహూ
౨౫ హూముకు యేసును వెతుకుతూ వచ్చిరి. అప్పుడు
సముద్రము అవతల ఆయనను కనుగొని—రబ్బీ నీవు
౨౬ యెప్పుడు యిక్కడికి వచ్చితివని పలికిరి. అం
దుకు యేసు—నిజమే నిజమే నేను మీతో చెప్పేది
యేమంటే మీరు అద్భుతములు చూచుటవల్ల కాదు
అయితే ఆ రొట్టెలు భుజించి తృప్తి పొందుటవల్లనే
౨౭ నన్ను వెతుకుతున్నారు. నిత్యజీవమునకు నిలిచే
టటువంటిన్ని మనుష్యకుమారుడు మీకు యిచ్చేట
టువంటిన్ని భోజనము కొరకే గాని నశించే భోజ
నము కొరకు కష్టపడకండి యెందుకంటే తండ్రి
అనగా దేవుడు ఆయనకు ముద్రవేసెనని వారికి
ప్రత్యుత్తరమిచ్చెను.
౨౮ కాబట్టి—మేము దేవుని క్రియలు జరిగించే
కొరకు యేమి చేయ వలెనని వారు ఆయనతో పలి
౨౯ కిరి. అందుకు యేసు—దేవుని క్రియ యేదంటే
ఆయన పంపిన వానియందు మీరు విశ్వాసముం
౩౦ చుటే అని వారికి ప్రత్యుత్తరమిచ్చినందున వారు-
కాబట్టి మేము చూచి నిన్ను విశ్వసించే కొరకు
నీవు యే అద్భుతము చేస్తున్నావు యేమి జరిగిస్తు
౩౧ న్నావు. ఆకాశమునుంచి రొట్టెను భుజించుటకు
వారికి యిచ్చెనని వ్రాయబడిన ప్రకారముగా మన
పితృలు అరణ్యములో మన్నా భుజించిరని ఆయ
నతో పలికిరి.
కాబట్టి యేసు—నిజమే నిజమే నేను మీతో ౩౨
చెప్పేది యేమంటే మోశే ఆ రొట్టెను ఆకాశము
నుంచి మీకు యివ్వలేదు అయితే నా తండ్రి ఆ
కాశమునుంచి నిజమైన రొట్టెను మీకు యిస్తు
న్నాడు యెందుకంటే ఆకాశమునుంచి దిగి లోక ౩౩
మునకు జీవము యిచ్చేది దేవుని రొట్టెయై యున్న
దని వారితో చెప్పెను. అందుచేతను వారు— ౩౪
ఓ ప్రభువా యెల్లప్పుడున్ను యీ రొట్టెను మాకు
దయచేయుమని పలికినప్పుడు యేసు వారితో చెప్పి ౩౫
నదేమంటే—నేను జీవపు రొట్టెనై యున్నాను నా
యొద్దికి వచ్చేవానికి ఆకలి యేమాత్రమున్ను కలు
గదు. నాయందు విశ్వాసముంచే వానికి దాహ
ము యెప్పుడున్ను కలుగదు. అయితే మీరు నన్ను ౩౬
చూచి యుండిన్ని విశ్వసించక వున్నారని మీతో
చెప్పితిని. తండ్రి నాకు యిచ్చే ప్రతివాడున్ను ౩౭
నా యొద్దికి వచ్చును నా యొద్దికి వచ్చే వాని నేను
యెంతమాత్రమున్ను బైటికి తోలివేయను యెందు
కంటే నన్ను పంపిన వాని యిచ్ఛనే గాని నా ౩౮
యిచ్ఛ నెరవేర్చుటకు ఆకాశమునుంచి వచ్చి
యుండలేదు. నన్ను పంపిన తండ్రి యిచ్ఛ యే ౩౯
దంటే—ఆయన నాకు యిచ్చిన యావత్తులో నేను
యేమిన్ని పోగొట్టుకొనక అంత్య దినమందు దాని
లేప వలెననేదే యెందుకంటే కుమారుని వైపు ౪౦
చూచి ఆయన యందు విశ్వాసముంచే ప్రతివా
డున్ను నిత్యజీవము పొంద వలెననేది నన్ను పం
పిన వాని యిచ్ఛయై యున్నది నేను అంత్య దిన
మందు వాని లేపుదునని పలికెను.
కాబట్టి—నేను ఆకాశమునుంచి దిగిన రొట్టెనై ౪౧
యున్నానని ఆయన పలికినందున యూదులు ఆ
యనను గురించి సణుగుతూ—యీయన యోసేపు
కుమారుడైన యేసు కాడా యీయన తలి దండ్రు ౪౨
లను మనము యెరుగుదుము గదా. అందుచేతను—
నేను ఆకాశమునుంచి దిగి యున్నానని యీయన
యేలాగు చెప్పగలడని పలికిరి. కాబట్టి యేసు— ౪౩
మీలో మీరు సణగకండి నన్ను పంపిన తండ్రి ౪౪
అతని లాగితేనే గాని యే మనుష్యుడున్ను నాయొ
ద్దికి రానేరడు నేను అంత్య దినమందు అతని లేపు
దును. మరిన్ని—వారందరున్ను దేవుని చేత నేర్ప ౪౫
బడుదురని ప్రవక్తల లేఖనములలో వ్రాయబడి
యున్నది. కాబట్టి తండ్రి వల్ల విని నేర్చుకొనిన

౪౬ ప్రతి వాడున్ను నాయొద్దికి వస్తున్నాడు. దేవుని
యొద్దనుంచి వచ్చి యున్న వాడు గాక యెవడైనా
తండ్రిని చూచినట్టు కాదు యీయనే తండ్రిని
చూచి యున్నాడు.
౪౭ నిజమే నిజమే నేను మీతో చెప్పేది యేమంటే
నాయందు విశ్వాసముంచే వానికి నిత్యజీవము కలిగి
౪౮ యున్నది. నేను జీవపు రొట్టైనై యున్నాను.
౪౯ మీ పితృలు అరణ్యములో మన్నా తిని చనిపో
౫౦ యిరి యెవడైనా యిది తిని చావక వుండేకొరకు
౫౧ ఆకాశమునుంచి దిగిన రొట్టె యిదే. నేను ఆకా
శమునుంచి దిగిన జీవముగల రొట్టైనై యున్నాను
యెవడైనా యీ రొట్టెను తిన్నట్టయితే యెల్లప్పు
డున్ను జీవించును. మరిన్ని నేను యిచ్చే రొట్టె
లోకముయొక్క జీవముకొరకు నేను యిచ్చే నా
మాంసమైయున్నదని పలికెను.
౫౨ కాబట్టి యూదులు—ఈయన తన మాంసము
యేలాగు తినుటకు యివ్వగలడని వొకనితో వొకడు
౫౩ వాదించిరి. అందుచేత యేసు—నిజమే నిజమే
నేను మీతో చెప్పేది యేమంటే మనుష్యకుమా
రుని మాంసము తిని ఆయన రక్తము తాగితేనేగాని
౫౪ మీలో జీవము కలిగి యుండదు. నా మాంస
ము తిని నా రక్తము తాగేవానికి నిత్యజీవము కలిగి
యున్నది. అంత్య దినమందు అతని లేపుదును
౫౫ యెందుకంటే నా మాంసము నిజముగా* భోజన
మున్ను నా రక్తము నిజముగా* పానమున్నైయు
౫౬ న్నది. నా మాంసము తిని నా రక్తము తాగేవా
డు నాయందున్ను నేను వానియందున్ను నిలుస్తు
౫౭ న్నాము. జీవించే తండ్రి నన్ను పంపిన ప్రకా
రము నేనున్ను తండ్రివల్ల జీవిస్తున్నాను. మరిన్ని
౫౮ నన్ను తినేవాడున్ను నా వల్ల జీవించును. ఇది
ఆకాశమునుంచి వచ్చిన రొట్టైయున్నది. మీ
పితృలు మన్నాను తిని చనిపోయిన ప్రకారము
కాదు యీ రొట్టె తినేవాడు యెల్లప్పుడున్ను
జీవించునని చెప్పెను.
౫౯ ఆయన కపెర్నహూములో బోధిస్తూ సునగో
౬౦ గులో వీటిని చెప్పెను గనుక ఆయన శిష్యులలో
అనేకులు విని—ఇది కఠినమైన మాట దాని యెవడు
౬౧ వినగలడని పలికిరి. అయితే యేసు తన శిష్యులు
దీని గురించి సణుగుతున్నారని తనలో యెరిగి—
౬౨ ఇది మీకు ఆతంకము కలుగ చేస్తున్నదా. కాబట్టి
మనుష్యకుమారుడు మునుపు వున్న చోటుకు యె
క్కుట చూచినట్టయితే—ఆత్మ జీవింప చేస్తున్నది
మాంసము కేవలము నిష్ప్రయోజనమై యున్నది. ౬౩
నేను మీతో పలికే మాటలు ఆత్మయున్ను జీవము
న్నైయున్నవి. అయితే మీలో నమ్మని వారు ౬౪
కొందరు వున్నారని వారితో చెప్పెను యెందు
కంటే నమ్మనివారు యెవరో అదిన్ని తన్ను అప్ప
గించనైయున్నవాడెవడో అదిన్ని మొదటినుంచి
యేసుకు తెలుసును. అప్పుడు ఆయన—నా తండ్రి ౬౫
చేత యివ్వ బడకుంటే యే మనుష్యుడున్ను నా
యొద్దికి రాలేడని దీనివల్ల మీతో చెప్పితినని వారి
తో పలికెను.

అప్పటినుంచి ఆయన శిష్యులలో అనేకులు ౬౬
వెనుకకు వెళ్లి ఆ తరువాత ఆయనతో నడువక
పోయిరి. కాబట్టి యేసు—మీరు కూడా వెళ్లి ౬౭
పోవుటకు యిచ్ఛయిస్తున్నారా అని పన్నెండు
మందితో పలికెను. అందుకు సీమోను పేతురు— ౬౮
ప్రభువా యెవని యొద్దికి వెళ్లిపోదుము నిత్యజీ
వపు మాటలు నీకు కలిగియున్నవి. నీవు జీవించే ౬౯
దేవుని కుమారుడవైన క్రీస్తువని మేము నమ్మి తెలు
సుకొని యున్నామని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చె
ను. అందుకు యేసు—నేను పన్నెండుమందిన్నైన ౭౦
మిమ్మును యేర్పరచుకొనలేదా అయితే మీలో
వొకడు సైతాను స్వరూపుడని వారికి ప్రత్యుత్తర
మిచ్చెను. సీమోను కుమారుడైన ఇస్కరియోతనే ౭౧
యూదాను గురించి దీని పలికెను యెందుకంటే
అతడు పన్నెండుమందిలో వొకడై ఆయనను అప్ప
గించనై యుండెను.

## ౭ పర్వము.

ఆ తరువాత యేసు గలిలైయలో తిరుగుతూ ౧
వుండెను యెందుకంటే యూదులు ఆయనను చం
పుటకు వెతుకుతూ వుండిరి గనుక యూదైయలో
తిరుగుటకు మనస్సు లేక పోయెను.

పర్ణశాలలు కట్టుటనే యూదుల పండుగ ౨
సమీపమై యుండెను గనుక ఆయన సహోదరు ౩
లు—నీ శిష్యులు కూడా నీవు చేసే నీ కార్య
ములను చూచేకొరకు యీ స్థలము విడిచి యూదై
యకు వెళ్లుము యెందుకంటే బహిరంగమందు వుం ౪
డుటకు కోరి రహస్యమందు యేదైనా చేసేవాడెవ
డున్ను లేడు. నీవు వీటిని చేసినట్టయితే నిన్ను
నీవే లోకమునకు అగుపరచుకొమ్మని ఆయనతో
చెప్పిరి యెందుకంటే ఆయన సహోదరులు ఆయన ౫
యందు విశ్వాసముంచలేదు.

* లేక, నిజమైన

౬ కాబట్టి యేసు—నా సమయము యింకా రా
లేదు మీ సమయము యెప్పుడున్ను సిద్ధమై యు
౭ న్నది. లోకము మిమ్మును ద్వేషించ నేరదు అయితే
దాని క్రియలు చెడ్డవని నేను దాని గురించి సాక్ష్య
౮ మిస్తున్నాను గనుక నన్ను ద్వేషిస్తున్నది. మీరు
యీ పండుగకు వెళ్లండి. నా సమయము యింకా
సంపూర్ణము కాలేదు గనుక నేను యీ పండు
౯ గకు యింకా వెళ్లనని వారితో చెప్పెను. వీటిని
వారితో చెప్పి గలిలైయలో నిలిచెను. అయితే
౧౦ ఆయన సహోదరులు వెళ్లిపోయిన తరువాత ఆ
యన కూడా బహిరంగము కాక రహస్యముగా
వున్నట్టే పండుగకు వెళ్లెను.
౧౧ కాబట్టి యూదులు—ఆయన యెక్కడ వున్నా
డని ఆ పండుగలో ఆయనను వెతుకుతూ వుండిరి.
౧౨ మరిన్ని ఆ జనసమూహములలో ఆయనను గురించి
మిక్కిలీ సణుగుట కలిగెను. కొందరు—ఆయన
మంచివాడని చెప్పిరి. మరి కొందరు—కాదు అ
౧౩ యితే ప్రజలను మోసపరుస్తున్నాడని చెప్పిరి. అ
యినప్పటికిన్ని యూదుల భయమువల్ల యెవడున్ను
ధైర్యముగా అయనను గురించి పలుక లేదు.
౧౪ అయితే పండుగ మధ్యను యేసు గుడిలో ప్రవే
౧౫ శించి బోధిస్తూ వుండెను. అప్పుడు యూదులు
ఆశ్చర్యపడి—నేర్చుకొనని యీయనకు లేఖన
౧౬ ములు యేలాగు తెలుసునని పలికిరి. కాబట్టి
యేసు—నా బోధ నాది కాదు అయితే నన్ను పం
౧౭ పిన వానిదై యున్నది. ఆయన యిచ్ఛ జరిగించు
టకు యెవడైనా యిచ్ఛయించినట్టయితే యీ బోధ
దేవునివల్ల కలిగినదో లేక నాయంతట నేనే పలికి
౧౮ నదో దాని యెరుగును. తనంతట తానే పలికే
వాడు తన స్వకీయ మహిమను వెతుకుతున్నాడు.
అయితే తన్ను పంపిన వాని మహిమను వెతికే
వాడు సత్యవంతుడు ఆయన యందు దుర్నీతి
౧౯ లేదు. మోశే మీకు ఆజ్ఞాప్రమాణము యివ్వ
లేదా—అయితే మీలో యెవడున్ను ఆజ్ఞాప్రమా
ణము గైకొంటున్నాడు కాదు యెందుకు నన్ను
చంపుటకు వెతుకుతున్నారని పలుకుతూ వారికి
౨౦ ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు జనసమూహము—
నీవు దయ్యము పట్టిన వాడవు యెవడు నిన్ను చం
పుటకు వెతుకుతున్నాడని ప్రత్యుత్తరమిచ్చెను.
౨౧ యేసు—నేను వొక కార్యమును చేసితిని అందువల్ల
౨౨ మీరందరున్ను ఆశ్చర్యపడుతున్నారు. మోశే
మీకు సున్నతీ నియమించెను అయితే అది పితృల
వల్లనే గాని మోశే వల్లనైనది కాదు. మీరు
సబ్బాతు దినమందు మనుష్యునికి సున్నతీ చేస్తు ౨౩
న్నారు. మోశే ఆజ్ఞాప్రమాణము మీరబడక వుండే
కొరకు వొక మనుష్యుడు సబ్బాతు దినమందు సు
న్నతీ పొందితే నేను సబ్బాతు దినమందు వొక
మనుష్యుని కేవలము స్వస్థుని చేసినందున నా మీద
కోపపడుతున్నారా. వెలిచూపువల్ల తీర్పు చేయక ౨౪
న్యాయమైన తీర్పుతో తీర్చండని వారికి ప్రత్యు
త్తరమిచ్చెను.
కాబట్టి యెరూశలేము వారిలో కొందరు— ౨౫
వారు చంపుటకు కోరుతున్నవాడు యీయన కా
డా అయితే యిదుగో ఆయన ధైర్యముగా మాట్లా ౨౬
డుతూ వున్నప్పటికిన్ని ఆయనతో యేమిన్ని చెప్పక
వున్నారు. నిజముగా యీయన క్రీస్తని అధి
కారులు వొక వేళ తెలుసుకొని యున్నారేమో—
అయితే యీయన యెక్కడి వాడో యీయనను ౨౭
యెరుగుదుము క్రీస్తు వచ్చేటప్పుడు ఆయన యె
క్కడి వాడో యెవనికిన్ని తెలియదని చెప్పుకొం
టూ వుండిరి. కాబట్టి యేసు—నన్ను యెరుగు ౨౮
దురు నేను యెక్కడి వాడనో యెరుగుదురు.
మరిన్ని నాకు నేనే రాలేదు అయితే నన్ను పంపిన
వాడు సత్యవంతుడై యున్నాడు.* ఆయనను మీరు
యెరుగరు. నేను ఆయనను యెరుగుదును యెందు ౨౯
కంటే ఆయన యొద్దనుంచి వచ్చితిని ఆయన నన్ను
పంపెనని గుడిలో బోధిస్తూ నోరెత్తి పలికెను.
కాబట్టి వారు ఆయనను పట్టుకొనుటకు వెతికిరి. ౩౦
అయితే ఆయన గడియ యింకా రాలేదు గనుక
యెవడున్ను ఆయన మీద చెయ్యి వేయ లేదు.
మరిన్ని జనసమూహములో అనేకులు ఆయన యం ౩౧
దు విశ్వాసముంచి—క్రీస్తు వచ్చేటప్పుడు యీయన
చేసిన వాటికంటే యెక్కువైన అద్భుతములు చేసు
నా అని చెప్పుకొంటూ వుండిరి. జనసమూహము ౩౨
ఆయనను గురించి వీటిని పలికి గుసగుసలాడుతూ
వుండుట ఫరిసైయులు వినిరి. అప్పుడు ఫరిసైయు
లున్ను ప్రధానయాజకులున్ను ఆయనను పట్టుకొ
నుటకు బంట్రౌతులను పంపిరి. కాబట్టి యేసు— ౩౩
ఇంకా కొంత కాలము నేను మీతో వున్నాను
అప్పుడు నన్ను పంపిన వాని యొద్దికి వెళ్లుతున్నాను.
మీరు నన్ను వెతికిన్ని నన్ను కనుగొనరు నేను యె ౩౪
క్కడ వుందునో అక్కడికి మీరు రా లేరని చె
ప్పెను. కాబట్టి యూదులు—మనము యితని కను ౩౫
గొనక వుండే లాగున యితడు యెక్కడికి వెళ్ల

* లేక, నిజముగా వున్నాడు.

బోతున్నాడు హెల్లేనీయులలో చెదిరిపోయిన వారి
యొద్దికి వెళ్లి హెల్లేనీయులకు వుపదేశించునా—
౩౬ నన్ను వెతికి చూడరనిన్ని నేను యెక్కడ వుందు
నో అక్కడికి మీరు రాలేరనిన్ని వాడు చెప్పిన
యీ మాట యేమిటో అని తమలో తాము పలు
కుతూ వుండిరి.
౩౭ ఆ పండుగలో గొప్పదైన అంత్య దినమందు
యేసు నిలిచి—యెవనికైనా దాహమైతే నా యొద్దికి
౩౮ వచ్చి తాగ వచ్చును. నాయందు విశ్వాసముంచే
వాడెవడో లేఖనము చెప్పిన ప్రకారము అతని
కడుపులోనుంచి జీవ జలము గల నదులు పారునని
౩౯ కంఠమెత్తి పలికెను. అయితే ఆయన యందు విశ్వా
సముంచే వారు పొందబోయే ఆత్మను గురించి దీని
చెప్పెను యెందుకంటే యేసు యింకా మహిమపర
చబడ లేదు గనుక పరిశుద్ధాత్మ యింకా వుండ లేదు.
౪౦ కాబట్టి జనసమూహములో అనేకులు ఆ మాట
విని—నిజముగా యీయన (మన) ప్రవక్తయై యు
౪౧ న్నాడని పలికిరి. ఇతరులు—ఈయన క్రీస్తే అని
పలికిరి. అయితే మరి కొందరు—క్రీస్తు గలిలైయ
౪౨ లోనుంచి వచ్చునా. క్రీస్తు దావీదు సంతాన
మందు పుట్టి దావీదు వున్న బేత్లెహేమనే వూరిలో
నుంచి వచ్చునని లేఖనము చెప్ప లేదా అని పలికిరి.
౪౩ కాబట్టి ఆయనను గురించి ఆ సమూహములో విభే
౪౪ దము కలిగెను. వారిలో కొందరు ఆయనను పట్టు
కొన కోరిరి. అయితే యెవడున్ను ఆయన మీద
చేతులు వేయ లేదు.
౪౫ కాబట్టి ఆ బంట్రౌతులు ప్రధానయాజకుల
యొద్దికిన్ని ఫరిసైయుల యొద్దికిన్ని వచ్చినప్పుడు
వారు—మీరు యెందుకు ఆయనను తీసుకొని రా
౪౬ లేదని అడిగినందుకు ఆ బంట్రౌతులు—ఈ మను
ష్యుని వలె మనుష్యుడు యెవడున్ను మాట్లాడ లేదని
౪౭ ప్రత్యుత్తరమిచ్చిరి. అందుకు ఫరిసైయులు—మీరు
౪౮ కూడా మోస పోతిరా అధికారులలోనైనా ఫరిసై
యులలోనైనా యెవడైనా ఆయన యందు విశ్వా
౪౯ సముంచెనా. అయితే ఆజ్ఞాప్రమాణము యెరు
గని యీ జనసమూహము శాపగ్రస్తమై యున్న
౫౦ దని వారికి ప్రత్యుత్తరమిచ్చిరి. రాత్రి వేళ ఆ
యన యొద్దికి వచ్చిన నికొదేము వారిలో వొకడై—
౫౧ మనుష్యుని మాట వినకనున్ను వాడు చేసే దాని
తెలుసుకొనకనున్ను మునుపే మన ఆజ్ఞాప్రమాణ
౫౨ ము వానికి తీర్పు చేసునా అని చెప్పెను. అం
దుకు వారు—నీవున్ను గలిలైయనుంచి వచ్చితివా.
విచారించి చూడు గలిలైయలో యే ప్రవక్తయున్ను
పుట్టలేదని ప్రత్యుత్తరమిచ్చి చెప్పిరి.

అప్పుడు ప్రతివాడున్ను తన తన యింటికి వెళ్లె ౫౩
ను అయితే యేసు ఒలీవచెట్ల కొండకు వెళ్లెను.

## ౮ పర్వము.

తెల్లవారేటప్పుడు యేసు తిరిగి గుడిలోకి వెళ్లి ౧
నప్పుడు ప్రజలందరూ ఆయనయొద్దికి వచ్చిరి. అ ౨
ప్పుడు ఆయన కూర్చుండి వారికి బోధిస్తూ వుం
డెను. అయితే శాస్త్రులున్ను ఫరిసైయులున్ను ౩
వ్యభిచారమందు పట్టుబడిన వొక స్త్రీని తీసుకొని
వచ్చి ఆమెను మధ్యను నిలువబెట్టి—బోధకుడా ౪
యీ స్త్రీ వ్యభిచరిస్తూ క్రియలోనే పట్టుబడెను.
అటువంటి వారిని రాళ్లతో కొట్టవలెనని మోశే ౫
ఆజ్ఞాప్రమాణములో మాకు ఆజ్ఞాపించెను. కాబట్టి
ఆమెను గురించి నీవు యేమి చెప్పుదువని ఆయన
తో పలికిరి. ఆయన యందు నేరము స్థాపించు ౬
టకు ఆయనను శోధిస్తూ యీలాగు పలికిరి. అ
యితే యేసు వంగి నేల మీద వేలితో వ్రాసెను.
వారు ఆయనను యింకా అడుగుతూ వున్నప్పుడు ౭
ఆయన లేచి—మీలో నిష్పాపియైన వాడు మొదట
ఆమె మీద రాయి వేయ వచ్చునని వారితో చెప్పి ౮
తిరిగి వంగి నేలమీద వ్రాస్తూవుండెను. అయితే ౯
వారు విని తమ మనస్సాక్షివల్ల గద్దించబడి పెద్దలు
మొదలుకొని కడపటి వారి పర్యంతమున్ను వొక
డొకడు బయిటికి వెళ్లిరి. అప్పుడు మధ్యను నిలి
చిన స్త్రీతో యేసు మాత్రమే వుండెను. యేసు ౧౦
లేచినప్పుడు ఆ స్త్రీని గాక మరి యెవనిన్ని చూడ
లేదు గనుక ఆయన ఓ స్త్రీ నీ మీద నేరము మో
పినవారు యెక్కడ వున్నారు యెవడున్ను నీకు
శిక్ష విధించ లేదా అని పలికినప్పుడు ఆమె—ప్రభు ౧౧
వా యెవడున్ను శిక్ష విధించ లేదని చెప్పెను.
అందుకు యేసు నేనున్ను నీకు శిక్ష విధించను నీవు
వెళ్లి యికమీదట పాపము చేయవద్దని ఆమెతో
పలికెను.

కాబట్టి యేసు—నేను లోకముయొక్క వెలు ౧౨
గునై యున్నాను నన్ను వెంబడించేవాడు చీకటి
లో నడువకుండా జీవపు వెలుగు గలవాడై యుం
డునని తిరిగి వారితో చెప్పెను. అందుకు ఫరి ౧౩
సైయులు—నిన్ను గురించి నీకు నీవే సాక్ష్యమిస్తు
న్నావు నీ సాక్ష్యము నిజముకాదని ఆయనతో
చెప్పినప్పుడు యేసు—నన్ను గురించి నేను సాక్ష్య ౧౪
మిచ్చినప్పటికిన్ని నా సాక్ష్యము నిజమైయున్నది
యెందుకంటే యెక్కడనుంచి వచ్చితినో యెక్క

డికి వెళ్లుదునో నేను యెరుగుదును అయితే నేను
యెక్కడనుంచి వస్తున్నానో యెక్కడికి వెళ్లుతు
౧౫ న్నానో మీరు తెలియరు. మీరు మాంసప్రకా
రము తీర్పు చేస్తున్నారు నేను యెవనికిన్ని
౧౬ తీర్పుచేయను. అయితే నేను తీర్పు చేసేపక్ష
మందు నా తీర్పు నిజమై యుండును యెందుకంటే
నేను వొక్కడనే కాను నేనున్ను నన్ను పంపిన
౧౭ తండ్రిన్ని యున్నాము. మరిన్ని యిద్దరు మను
ష్యుల సాక్ష్యము నిజమై యున్నదని మీ ఆజ్ఞా
౧౮ ప్రమాణములో వ్రాయబడియున్నది. నన్ను గు
రించి నేను సాక్ష్యమిచ్చేవాడనై యున్నాను.
నన్ను పంపిన తండ్రిన్ని నన్ను గురించి సాక్ష్య
మిస్తున్నాడని ప్రత్యుత్తరము చెప్పెను.
౧౯ అందుకు వారు—నీ తండ్రి యెక్కడ వున్నా
డని పలికినప్పుడు యేసు—మీరు నన్నైనా నా
తండ్రినైనా యెరుగరు నన్ను యెరిగినట్టయితే నా
తండ్రిని కూడా యెరుగుదురని వారికి ప్రత్యుత్తర
౨౦ మిచ్చెను. ఆయన గుడిలో బోధిస్తూ కానుకల
పెట్టె గల చోట వీటిని పలికెను అయితే ఆయన
గడియ యింకా రాలేదు గనుక యెవడున్ను ఆయ
౨౧ నను పట్టుకొనలేదు. కాబట్టి యేసు—నేను వెళ్లి
పోతున్నాను మీరు నన్ను వెతుకుదురు గాని మీ
పాపమువల్ల* చనిపోదురు నేను వెళ్లే చోటుకు
౨౨ మీరు రాలేరని తిరిగీ వారితో చెప్పెను. అం
దుకు యూదులు—నేను వెళ్లే చోటుకు మీరు
రాలేరని చెప్పుతున్నాడు గనుక తన్ను తానే చం
౨౩ పుకొనునా అని పలికిరి. అప్పుడు ఆయన—
మీరు కిందివారు నేను మీదివాడను. మీరు యీ
లోకపువారు నేను యీ లోకపువాడను కాను
౨౪ గనుక మీ పాపమువల్ల* మీరు చనిపోదురని మీ
తో చెప్పితిని యెందుకంటే నేను యేమైయున్నా
నో† మీరు నమ్మకపోతే మీ పాపములవల్ల* చని
౨౫ పోదురని వారితో చెప్పెను. అందుకు వారు—నీవు
యెవడవు అని ఆయనతో పలికినప్పుడు యేసు—
మొదటినుంచి మీతో చెప్పుతూవున్న వాడనే.
౨౬ మిమ్మును గురించి చెప్పుటకున్ను తీర్పు చేయుటకు
న్ను అనేకమైనవి నాకు కలవు అయితే నన్ను పంపి
నవాడు సత్యవంతుడు. నేను ఆయనయొద్ద వేటిని
వింటినో వాటిని లోకములో పలుకుతున్నానని
వారితో చెప్పెను.
౨౭ ఆయన తండ్రిని గురించి తమతో మాట్లాడెనని
౨౮ వారు గ్రహించలేదు గనుక యేసు—మీరు మను
ష్య కుమారుని యెప్పుడు యెక్కించి యుందురో
అప్పుడు నేను యేమై యున్నానో† తెలుసుకొం
దురు. నాకు నేనే యేమిన్ని చేయక నా తండ్రి
నాకు నేర్పిన ప్రకారము వీటిని పలుకుతున్నాను.
మరిన్ని నన్ను పంపిన వాడు నాకు తోడై యు ౨౯
న్నాడు. ఆయనకు యిష్టమైన వాటిని యెల్లప్పు
డున్ను చేస్తున్నాను గనుక తండ్రి నన్ను వొంటిగా
విడువలేదని వారితో పలికెను.
ఆయన వీటిని పలుకుతూ వున్నప్పుడు అనేకులు ౩౦
ఆయన యందు విశ్వాసముంచిరి. కాబట్టి యేసు– ౩౧
మీరు నా వాక్యమందు నిలిచియుంటే యథార్థ
ముగా నా శిష్యులై యుండి సత్యమును తెలుసు
కొందురు అప్పుడు సత్యము మిమ్మును విడిపించు ౩౨
నని తన యందు విశ్వాసముంచిన వారితో చెప్పెను.
అందుకు వారు—మేము అబ్రాహాముయొక్క సం ౩౩
తానము మేము యెన్నడున్ను యెవనికిన్ని దాసు
లమై యుండ లేదు మీరు విడిపించబడుదురని నీవు
యేల చెప్పుతున్నావని ఆయనకు ప్రత్యుత్తరమి
చ్చిరి. అందుకు యేసు—పాపము చేసే ప్రతివా ౩౪
డున్ను పాపముయొక్క దాసుడై యున్నాడు.
దాసుడు యెల్లప్పుడున్ను యింటిలో నిలువడు అ ౩౫
యితే కుమారుడు యెల్లప్పుడున్ను నిలుచును. కా ౩౬
బట్టి కుమారుడు మిమ్మును విడిపించినట్టయితే నిశ్చ
యముగా విడుదల గలవారై యుందురు. మీరు ౩౭
అబ్రాహాముయొక్క సంతానమని నాకు తెలుసును
అయితే నా వాక్యము మీలో సాగదు గనుక నన్ను
చంపుటకు వెతుకుతున్నారు. నేను నా తండ్రి ౩౮
యొద్ద చూచిన దాని పలుకుతున్నాను మీరున్ను
మీ తండ్రియొద్ద చూచిన దాని పలుకుతున్నారని
నిజమే నిజమే మీతో చెప్పుతున్నాను అని వారికి
ప్రత్యుత్తరమిచ్చెను. వారు—మా తండ్రి అబ్రాహా ౩౯
మని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చిరి. యేసు—మీరు
అబ్రాహాము పిల్లలైతే అబ్రాహాముయొక్క క్రియ
లు చేతురు. అయితే నేను దేవునివల్ల వినిన సత్యమే ౪౦
మీతో చెప్పిన మనుష్యుడనైన నన్ను మీరు యిప్పు
డు చంపుటకు వెతుకుతున్నారు. ఇది అబ్రాహాము ౪౧
చేయలేదు. మీరు మీ తండ్రియొక్క క్రియలు
చేస్తున్నారని వారితో చెప్పెను. అందుకు వారు—
మేము వ్యభిచారమువల్ల పుట్ట లేదు దేవుడైన తండ్రి
వొక్కడే మాకు కలడని చెప్పినప్పుడు యేసు— ౪౨
దేవుడు మీ తండ్రియై యుంటే నన్ను ప్రేమిం
తురు యెందుకంటే నేను దేవుని యొద్దనుంచి బైలు

* లేక, లో. † లేక, నేను ఆయననని.

దేరి వచ్చితిని. అంతే కాకుండా నాయంతట
నేనే రాలేదు అయితే ఆయన నన్ను పంపెను.
౪౩ మీరు యెందుకు నా పలుకును యెరుగరు మీరు
౪౪ నా మాట విన నేరక వుండుట వల్లనే. మీరు(మీ)
తండ్రియైన సైతాను సంబంధులు మీ తండ్రియొక్క
దురాశలు నెరవేర్చుటకు యిచ్ఛయిస్తున్నారు
వాడు మొదటినుంచి నరహంతకుడై సత్యమందు
నిలువ లేదు యెందుకంటే వానియందు సత్యము
లేదు. వాడు అబద్ధము పలికేటప్పుడు స్వకీయ
మైన వాటినుంచి పలుకును యెందుకంటే అబద్ధి
౪౫ కుడున్ను దాని తండ్రియున్నై యున్నాడు. మ
రిన్ని నేను సత్యము చెప్పుతున్నాను గనుక మీరు
నన్ను నమ్మరు. మీలో యెవడు నన్ను పాపమును
౪౬ గురించి గద్దించును. నేను సత్యము చెప్పుతూ
వుంటే మీరు యెందుకు నన్ను నమ్మరు. దేవుని
౪౭ సంబంధియైన వాడు దేవుని మాటలు వినును అందు
చేతను మీరు దేవుని సంబంధులు కారు గనుక
మీరు వినరని వారితో చెప్పెను.
౪౮ అందుకు యూదులు—నీవు సమరైయుడవున్ను
దయ్యము పట్టిన వాడవున్నై యున్నావని మేము
బాగా చెప్ప లేదా అని ఆయనను ప్రత్యుత్తరమి
౪౯ చ్చిరి. అప్పుడు యేసు—నేను దయ్యము పట్టిన
వాడను కాను అయితే నా తండ్రిని ఘనపరుస్తు
న్నాను మీరు నన్ను అవమాన పరుస్తున్నారు.
౫౦ నేను నా మహిమను వెతుకను. వెతుకుతున్ను
తీర్పు చేస్తున్ను వుండే వాడు వొకడు వున్నాడు.
౫౧ యెవడైనా నా వాక్యమును గైకొంటే యెన్నడు
న్ను మరణము చూడడని నిజమే నిజమే మీతో
౫౨ చెప్పుతున్నానని ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు
యూదులు—నీవు దయ్యము పట్టిన వాడవని యి
ప్పుడు తెలుసుకొంటిమి అబ్రాహామున్ను ప్రవక్త
లున్ను చనిపోయిరి అయినప్పటికిన్ని—నా వాక్య
మును యెవడైనా గైకొంటే యెన్నడున్ను మరణపు
౫౩ రుచి చూడడని నీవు చెప్పుతున్నావు. చనిపో
యిన అబ్రాహామనే మా తండ్రికంటే నీవు గొప్ప
వాడవా ప్రవక్తలున్ను చనిపోయిరి నిన్ను నీవే
యెవనిగా చేసుకొంటున్నావని ఆయనతో పలికిరి.
౫౪ అందుకు యేసు—నన్ను నేనే మహిమపరచుకొంటే
నా మహిమ వట్టిది. మా దేవుడని మీరు యెవని
గూర్చి చెప్పుతున్నారో ఆ నా తండ్రి నన్ను
౫౫ మహిమపరుస్తున్నాడు. మీరు ఆయనను యెరుగ
లేదు అయితే నేను ఆయనను యెరుగుదును ఆయ
నను యెరగనని నేను చెప్పినట్టయితే మీవలె అబ
ద్ధికుడనై యుందును అయితే ఆయనను యెరిగి ఆ
యన వాక్యము గైకొంటున్నాను. మీ తండ్రి ౫౬
యైన అబ్రాహాము నా దినమును చూచుటకు సం
తోషించెను. ఆయన చూచి ఆనందించెనని ప్ర
త్యుత్తరమిచ్చెను. అందుకు యూదులు—నీకు ౫౭
యింకా యేబది సంవత్సరములు లేవు గదా అ
బ్రాహామును చూచితివా అని ఆయనతో పలికిరి.
అందుకు యేసు—అబ్రాహాము పుట్టక మునుపు ౫౮
నేను వున్నానని మీతో నిజమే నిజమే చెప్పుతు
న్నాను అని పలికెను. కాబట్టి వారు ఆయన మీద ౫౯
రువ్వుటకు రాళ్లు పట్టుకొనిరి. అయితే యేసు
దాగి గుడిలోనుంచి బయిలుదేరి వారి మధ్యనుంచి
ఆలాగు వెళ్లిపోయెను.

## ౯ పర్వము.

ఆయన వెళ్లుతూ వున్నప్పుడు పుట్టినది మొదలు ౧
కొని గుడ్డియైన వొక మనుష్యుని చూచెను. అ ౨
ప్పుడు ఆయన శిష్యులు—రబ్బీ యితడు గుడ్డివాడై
పుట్టుటకు యెవడు పాపము చేసెను యితడా లేక
యితని కన్నవారా అని ఆయనను అడిగిరి. అం ౩
దుకు యేసు— ఇతడైనా యితని కన్నవారైనా
పాపము చేయ లేదు అయితే దేవుని క్రియలు
అతని యందు అగుపరచబడుటకే. పగలు వు ౪
న్నంత మట్టుకు నన్ను పంపిన వాని క్రియలు నేను
చేస్తూ వుండ వలెను. రాత్రి వస్తున్నది అప్పుడు
యెవడున్ను కార్యము చేయ లేడు. నేను యీ ౫
లోకమందు వున్నప్పుడు లోకమునకు వెలుగై యు
న్నానని ప్రత్యుత్తరమిచ్చెను. వీటిని పలికి నేల ౬
మీద వుమ్మివేసి ఆ యుమ్మితో బురద చేసి ఆ గుడ్డి
వాని కన్నుల మీద ఆ బురద రాచి—పంపబడిన ౭
వాడనే అర్థమిచ్చే సిలోహామనే కోనేటికి నీవు
వెళ్లి అందులో కడుగుకొమ్మని చెప్పెను అతడు వెళ్లి
కడుగుకొని చూపు గలవాడై వచ్చెను.
కాబట్టి ఆ పొరుగు వారున్ను వాడు గుడ్డి ౮
యని ముందు చూచిన వారున్ను—వీడు కూర్చుని
భిక్షమెత్తుతూ వున్న వాడు కాడా అని పలుకు
తూ వుండిరి. వీడే అని కొందరున్ను వాని పోలి ౯
యున్న వాడని మరి కొందరున్ను పలికిరి. అప్పుడు
అతడు—వాడను నేనే అని చెప్పెను. కాబట్టి ౧౦
వారు—నీ కన్నులు యేలాగు తెరవబడెనని అతని
తో పలికిరి. అందుకు అతడు—యేసు అనబడిన ౧౧
వొక మనుష్యుడు బురద చేసి నా కన్నుల మీద
దాని రాచి—నీవు సిలోహామనే కోనేటికి వెళ్లి (నీ
కన్నులు) కడుగుకొమ్మని నాతో చెప్పెను. నేను
వెళ్లి కడుగుకొని చూపు పొందితినని ప్రత్యుత్తర

౧౨ మిచ్చెను. అంతట వారు ఆయన యెక్కడ వున్నా
డని పలికినప్పుడు వాడు నేనెరుగనని చెప్పెను.
౧౩ వారు ముందు గుడ్డియైన వాని ఫరిసైయుల
౧౪ యొద్దికి తీసుకొని వెళ్లిరి. మరిన్ని యేసు ఆ బు
రద చేసి అతని కన్నులు తెరవ చేసినప్పుడు సబ్బా
౧౫ తనే దినమై యుండెను గనుక అతడు యేలాగు
చూపు పొందెనో దాని గురించి ఫరిసైయులున్ను
తిరిగీ అతని అడిగిరి. అప్పుడు అతడు—నా
కన్నులమీద ఆయన బురద వేసెను అప్పుడు నేను
కడుగుకొని చూస్తున్నానని వారితో చెప్పెను.
౧౬ కాబట్టి ఫరిసైయులలో కొందరు—ఈ మనుష్యుడు
సబ్బాతును ఆచరించక వున్నాడు గనుక దేవుని
సంబంధి* కాడని పలుకుతూ వుండిరి. మరి కొం
దరు—పాపియైన మనుష్యుడు యీలాటి అద్భుత
ములను యేలాగు చేయగలడని పలుకుతూ వుండిరి.
౧౭ అంతట వారిలో విభేదము కలిగెను. కాబట్టి
వారు తిరిగీ ఆ గుడ్డివానితో—అతడు నీ కన్నులు
తెరవచేసినందున నీవు అతని గురించి యేమి చెప్పు
తున్నావని పలికిరి. అందుకు అతడు—ఆయన
౧౮ ప్రవక్తయని చెప్పెను. కాబట్టి యూదులు చూపు
౧౯ పొందిన వాని తలిదండ్రులను పిలిపించి—గుడ్డివాడై
పుట్టెనని మీరు చెప్పే మీ కుమారుడు యితడా
ఆలాగైతే అతడు యిప్పుడు దేనివల్ల చూస్తున్నా
డని వారిని అడిగిన దాక వాడు గుడ్డివాడై చూపు
౨౦ పొందెనని నమ్మలేదు. అందుకు అతని తలిదం
డ్రులు—ఇతడే మా కుమారుడనిన్ని అతడు గుడ్డి
౨౧ వాడై పుట్టెననిన్ని యెరుగుదుము. అయితే యి
ప్పుడు అతనికి చూపు యేలాగు కలిగెనో అది
యెరుగము యెవడు అతని కన్నులు తెరవ చేసెనో
అదిన్ని మేమెరుగము అతనికి (యుక్త) వయస్సు
కలిగెను అతని అడుగండి తన్ను గురించి తానే
౨౨ పలుకగలడని వారికి ప్రత్యుత్తరమిచ్చిరి. అతని
తలిదండ్రులు యూదులకు భయపడినందున ఆలాగు
పలికిరి యెందుకంటే ఆయన క్రీస్తని యెవడైనా
ఒప్పుకొన్నట్టయితే వాడు సునగోగునుంచి వెలి
వేయబడుటకు యూదులు అంతకు మునుపు నిర్ణ
౨౩ యించుకొనిరి గనుక అతని తలిదండ్రులు—అతనికి
యుక్త వయస్సు కలిగెను అతని అడుగండని చెప్పిరి.
౨౪ కాబట్టి వారు రెండోమారున్ను గుడ్డివాడైన
మనుష్యుని పిలిపించి—నీవు దేవుని మహిమపరుచు
ము యీ మనుష్యుడు పాపియని మేము యెరుగు
౨౫ దుము అని అతనితో పలికినందున అతడు—ఆయన
పాపి అవునో కాదో నాకు తెలియదు నాకు
తెలిసినదేమంటే నేను గుడ్డినైయుండి యిప్పుడు
చూస్తున్నానని ప్రత్యుత్తరమిచ్చెను. అప్పుడు ౨౬
వారు—ఆయన నీకు యేమి చేసెను. నీ కన్నులు
యేలాగు తెరవ చేసెనని తిరిగీ అతనితో పలికిరి.
అప్పుడు అతడు—యిందాక మీతో చెప్పినప్పటి ౨౭
కిన్ని మీరు వినలేదు. తిరిగీ వినుటకు యెందుకు
కోరుతున్నారు ఆయన శిష్యులవుటకు మీరున్ను
కోరుతున్నారా అని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.
అప్పుడు వారు—నీవు వాని శిష్యుడవు అయితే ౨౮
మేము మోశే శిష్యులమై యున్నాము. దేవుడు ౨౯
మోశేతో మాట్లాడెనని యెరుగుదుము అయితే
వీడు యెక్కడనుంచి వచ్చెనో అది యెరుగమని
అతని దూషించి చెప్పిరి. అందుకు ఆ మనుష్య ౩౦
డు—ఆలాగైతే దీనిలో ఆశ్చర్యమైనది కలదు యే
మంటే ఆయన యెక్కడనుంచి వచ్చెనో మీరెరు
గరు అయినప్పటికిన్ని ఆయన నా కన్నులు తెరవ
చేసెను. అయితే దేవుడు పాపుల మనవి ఆలకిం ౩౧
చడని యెరుగుదుము అయితే యెవడైనా దేవభ
క్తుడైయుండి ఆయనకు యిష్టమైనది చేసినట్టయితే
అతని మనవి ఆలకించును. పుట్టు గుడ్డివాని ౩౨
కన్నులు యెవడైనా తెరవ చేసెనని యెన్నడున్ను
వినబడలేదు. ఈయన దేవుని సంబంధి* కాక ౩౩
పోతే యేమిన్ని చేయనేరడని వారికి ప్రత్యుత్తర
మిచ్చెను. అందుకు వారు—నీవు కేవలము పా ౩౪
పివై పుట్టినావు నీవు మాకు బోధపరుస్తున్నావా
అని అతనికి ప్రత్యుత్తరమిచ్చి అతని వెలివేసిరి.
వారు అతని వెలివేసిరని యేసు విని అతని కను ౩౫
గొని—నీవు దేవుని కుమారుని యందు విశ్వాసముంచి
యున్నావా అని పలికినప్పుడు అతడు—ప్రభువా ౩౬
నేను ఆయన యందు విశ్వాసముంచే కొరకు ఆయన
యెవడని ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు యేసు— ౩౭
నీవు ఆయనను చూచి యున్నావు నీతో మాట్లా
డుతూ వున్న వాడు ఆయనే అని చెప్పినప్పుడు
అతడు—ప్రభువా నమ్ముతున్నానని చెప్పి ఆయనకు ౩౮
నమస్కరించెను. అప్పుడు యేసు—చూపు లేని ౩౯
వారు చూచుటకున్ను చూపు గల వారు గుడ్డివార
వుటకున్ను న్యాయము తీర్చే కొరకు యీ లోక
మునకు వచ్చితినని చెప్పెను.
అప్పుడు ఆయన యొద్ద వున్న ఫరిసైయులలో ౪౦
కొందరు వీటిని విని మేమున్ను గుడ్డి వారమా అని
పలికిరి. అందుకు యేసు—మీరు గుడ్డివారైతే ౪౧

* లేక, యొద్దనుంచి వచ్చినవాడు.

పాపముగల వారు కారు అయితే యిప్పుడు చూస్తు
న్నామని మీరు చెప్పుకొంటున్నారు గనుక మీ
పాపము నిలిచి యున్నది.

## ౧౦ పర్వము.

నిజమే నిజమే నేను మీతో చెప్పేది యేమం
టే—గొర్రెల దొడ్డిలో ద్వారమున ప్రవేశించక
వేరొక మార్గమున యెక్కేవాడు దొంగయున్ను
౨ దోచుకొనేవాడున్నై యున్నాడు. అయితే ద్వా
రమున ప్రవేశించే వాడు గొర్రెల కాపరియై యు
౩ న్నాడు. అతనికి ద్వారపాలకుడు తలుపు తీసును
గొర్రెలు అతని శబ్దము ఆలకించును. అతడు తన
గొర్రెలను పేరు పెట్టి పిలిచి వాటిని వెలపటికి నడి
౪ పించును మరిన్ని ఆయన స్వకీయమైన గొర్రెలను
వెలపటికి నడిపించేటప్పుడు వాటికంటే ముందుగా
నడుచును అప్పుడు గొర్రెలు ఆయన శబ్దము యెరు
౫ గును గనుక ఆయనను వెంబడించును. అయితే
అన్యుల శబ్దము యెరుగవు గనుక అన్యుని వెంబ
డించక వాని యొద్దనుంచి పారిపోవునని వారితో
పలికెను.
౬ ఈ సాదృశ్యము యేసు వారితో చెప్పెను
అయితే ఆయన వారితో చెప్పిన వాటి భావము
౭ వారికి బోధపడ లేదు. కాబట్టి యేసు తిరిగి—
నిజమే నిజమే నేను మీతో చెప్పేదేమంటే నేనే
౮ గొర్రెల ద్వారమును. నాకు ముందు* వచ్చిన
వారందరు దొంగలున్ను దోచుకొనే వారున్నై
యున్నారు. అయితే గొర్రెలు వారి మాట వినలే
౯ దు. నేను ద్వారమునై యున్నాను నా ద్వారా
యెవడైనా ప్రవేశించినట్టయితే అతడు రక్షించబడి
ప్రవేశిస్తూ బయిటికి వెళ్లుతూ మేపు పొందును.
౧౦ దొంగ దొంగతనమునున్ను హత్యనున్ను నాశనము
నున్ను చేసుటకే గాని మరి దేనికిన్ని రాడు.
వాటికి జీవము కలుగుటకున్ను అది విస్తారమవుట
౧౧ కున్ను నేను వచ్చితిని. నేను గొర్రెల మంచి కాప
రిని. మంచి కాపరి గొర్రెల కొరకు తన ప్రాణము
౧౨ పెట్టుతున్నాడు. అయితే గొర్రెల కాపరి కాన
టువంటి జీతగాడు గొర్రెలు తన స్వకీయమైనవి
కానందున తోడేలు వచ్చుట చూచి గొర్రెలను
విడిచి పారిపోవును అప్పుడు తోడేలు వాటిని
౧౩ పట్టి† ఆ గొర్రెలను చెదర చేసును. జీతగాడు
జీతగాడైనందున గొర్రెలను గురించి చింతించడు
౧౪ గనుక వాడు పారిపోవును. నేను గొర్రెల మంచి
౧౫ కాపరినై యున్నాను తండ్రి నన్ను యేలాగు యెరిగి
యున్నాడో నేను తండ్రిని యేలాగు యెరిగి యు
న్నానో ఆలాగే నేను నా వాటిని యెరిగి నా
వాటివల్ల యెరుగబడుతున్నాను మరిన్ని గొర్రెల
కొరకు నా ప్రాణము పెట్టుతున్నాను. మరిన్ని ౧౬
యీ దొడ్డివి కాని వేరే గొర్రెలు నాకు కలవు
వాటిని కూడా నేను తీసుకొని రావలెను. అవి
నా శబ్దము వినును అప్పుడు మంద వొక్కటిన్ని
గొర్రెల కాపరి యొక్కడున్ను వుండును. ఇందు ౧౭
వల్ల (నా) తండ్రి నన్ను ప్రేమిస్తున్నాడు యెం
దుకంటే తిరిగి దాని పొందేకొరకు నా ప్రాణము
పెట్టుతున్నాను నా యొద్దనుంచి యెవ్వడున్ను ౧౮
దాని పుచ్చుకొనడు అయితే నాకు నేనే దాని
పెట్టుతున్నాను దాని పెట్టుటకు నాకు అధికార
ము‡ కలదు. దాని తిరిగి పుచ్చుకొనుటకున్ను
నాకు అధికారము‡ కలదు. నా తండ్రివల్ల యీ
ఆజ్ఞ పొందితినని వారితో పలికెను.
కాబట్టి యీ మాటలవల్ల యూదులలో విభేద ౧౯
ము తిరిగి పుట్టెను. వారిలో అనేకులు—ఆయన ౨౦
దయ్యము పట్టినవాడున్ను వెర్రివాడున్నై యు
న్నాడు వాని (మాట) యెందుకు వింటున్నారని
పలికిరి. మరి కొందరు—ఇవి దయ్యము పట్టిన ౨౧
వాని మాటలు కావు. దయ్యము గుడ్డివారి కన్ను
లు తెరవ చేయగలదా అని పలికిరి.
మరిన్ని ఆలయ ప్రతిష్ఠ అనే పండుగ యెరూ ౨౨
శలేములో కలిగెను. శీతకాలమై యుండెను ౨౩
గనుక యేసు సొలమోను మంటపములో తిరుగుతూ
వుండెను. కాబట్టి యూదులు ఆయన చుట్టూ ౨౪
కూడి—యెంత పర్యంతము మమ్మును సందేహపెట్టు
దువు నీవు క్రీస్తువైతే మాతో ధైర్యముగా చెప్పుమ
నిరి. అందుకు యేసు—మీతో చెప్పితిని అయితే ౨౫
మీరు నమ్మక వున్నారు నేను నా తండ్రినామ ౨౬
మందు యే కార్యములు చేస్తున్నానో అవి నన్ను
గురించి సాక్ష్యమిస్తున్నవి. అయినప్పటికిన్ని మీరు
నా గొర్రెలలో వున్నారు కారు గనుక మీరు
నమ్మక వున్నారు నేను మీతో చెప్పిన ప్రకారము ౨౭
నా గొర్రెలు నా శబ్దము వినును నేను వాటిని
యెరుగుదును అవి నన్ను వెంబడించును. నేను ౨౮
వాటికి నిత్యజీవము యిస్తున్నాను అవి యెన్నడు
న్ను నశించవు యెవ్వడున్ను వాటిని నా చేతిలో
నుంచి అపహరించడు. వాటిని నాకు యిచ్చిన ౨౯
నా తండ్రి అందరికంటే గొప్పవాడు గనుక నా
తండ్రి చేతిలోనుంచి వాటిని అపహరించుటకు శక్తి

* లేక, నాకంటే ముందట. † లేక, చీల్చి. ‡ లేక, శక్తి.

౩౦ గల వాడెవ్వడున్ను లేడు. నేనున్ను తండ్రిన్ని
యేకమై యున్నామని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.
౩౧ కాబట్టి యూదులు ఆయనను కొట్టుటకు తిరిగీ
౩౨ రాళ్లు పట్టుకొనిరి. అప్పుడు యేసు—అనేకమైన
మంచి క్రియలు నా తండ్రివల్ల మీకు అగుపరిచి
తిని వాటిలో యే క్రియ నిమిత్తము నన్ను రాళ్ల
తో కొట్టుతున్నారని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.
౩౩ యూదులు—నీవు మనుష్యుడవై యుండి నిన్ను
నీవే దేవుని చేసుకొంటున్నావు గనుక దూషణ
నిమిత్తమే గాని మంచి క్రియ నిమిత్తము నిన్ను
రాళ్లతో కొట్టుతున్నాము కామని ఆయనకు ప్ర
౩౪ త్యుత్తరమిచ్చిరి. అందుకు యేసు—మీరు దేవుం
డ్లు అయి యున్నారని నేను చెప్పితిని అనేది మీ
౩౫ ఆజ్ఞాప్రమాణములో వ్రాయబడలేదా. దేవుని
వాక్యము యెవరికి వచ్చెనో వారిని దేవుండ్లని
చెప్పినట్టయితే లేఖనము తప్ప వల్లకాదు గనుక
నేను దేవుని కుమారుడనై యున్నానని చెప్పినం
౩౬ దున తండ్రి పరిశుద్ధపరిచి యీ లోకములోకి పం
పిన వానితో—నీవు (దేవుని) దూషిస్తున్నావని
౩౭ చెప్పుదురా. నేను నా తండ్రి క్రియలు చేయ
౩౮ కుంటే నన్ను నమ్మకండి. అయితే నేను చేసిన
పక్షమందు నన్ను నమ్మక పోయినప్పటికిన్ని తండ్రి
నా యందున్ను నేను ఆయన యందున్ను వున్నా
మని మీరు తెలుసుకొని నమ్ముటకు ఆ క్రియలను
నమ్మండని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.
౩౯ కాబట్టి వారు తిరిగీ ఆయనను పట్టుకొనుటకు
౪౦ వెతికిరి అయితే ఆయన వారి చేతులను తప్పించు
కొని యొర్దాను అవతల యోహాను మొదట
స్నానమిస్తూ వున్న స్థలమునకు తిరిగీ వెళ్లి అక్కడ
౪౧ కాపురముండెను. అప్పుడు అనేకులు ఆయన
యొద్దికి వచ్చి యోహాను యే అద్భుతమున్ను చేయ
లేదు అయితే యీయనను గురించి యోహాను చెప్పి
౪౨ నవన్నిన్ని నిజమైనవని చెప్పిరి. అక్కడ అనేకు
లు ఆయన యందు విశ్వాసముంచిరి.

## ౧౧ పర్వము.

మరియయొక్కయున్ను ఆమె సహోదరియైన
మార్థయొక్కయున్ను గ్రామమైన బేథనియలో
౨ వున్న లాజరనే వొకడు రోగియై యుండెను. యే
మరియ ప్రభువుకు అత్తరు పూసి తన తల వెంట్రు
కలతో ఆయన పాదములను తుడిచెనో ఆమె
౩ సహోదరుడైన లాజరు రోగియై యుండెను. కా
బట్టి అతని అక్కచెల్లెండ్లు—ప్రభువా యిదుగో
నీవు ప్రేమించేవాడు రోగియైయున్నాడని ఆయన
౪ యొద్దికి వర్తమానము పంపిరి. అయితే యేసు
అది విని—ఈ రోగము దేవుని కుమారుడు దాని
వల్ల మహిమపరచబడే కొరకు దేవుని మహిమ
నిమిత్తమైనది గాని మరణార్థమై వచ్చినది కా
దని చెప్పెను. మరిన్ని యేసు మార్థానున్ను ఆమె ౫
సహోదరినిన్ని లాజరునున్ను ప్రేమించెను. కా ౬
బట్టి అతడు రోగి అని యేసు విన్నప్పుడు తాను
వున్న స్థలమందు యింకా రెండు దినములు నిలిచె
ను. అటుపిమ్మట ఆయన—మనము యూదైయకు ౭
తిరిగీ వెళ్లుదామని తన శిష్యులతో చెప్పినప్పుడు
ఆ శిష్యులు—రబ్బీ యిప్పటికిన్ని యూదులు నిన్ను ౮
రాళ్లతో కొట్టుటకు వెతుకుతూ వుండిరి గదా
అక్కడికి తిరిగీ వెళ్లుదువా అని ఆయనతో చెప్పిరి.
అందుకు యేసు—పగటి గంటలు పన్నెండు ౯
వున్నవి గదా యెవడైనా పగటియందు నడిచినట్ట
యితే యీ లోకపు వెలుగు చూస్తున్నాడు గనుక
అతనికి యే ఆతంకమున్ను వుండదు. అయితే ౧౦
యెవడైనా రాత్రియందు నడిచినట్టయితే వానికి
వెలుగు లేదు గనుక అతడు ఆతంకపరచబడునని
ప్రత్యుత్తరమిచ్చెను.
ఆయన వీటిని చెప్పిన తరువాత—మన స్నేహి ౧౧
తుడైన లాజరు నిద్రించియున్నాడు అయితే ఆయ
నను లేపుటకు వెళ్లుతున్నానని వారితో చెప్పెను.
అందుకు ఆయన శిష్యులు—ప్రభువా ఆయన ౧౨
నిద్రించినట్టయితే బాగుపడునని చెప్పిరి. అయితే ౧౩
ఆయన నిద్ర విశ్రాంతిని గురించి చెప్పెనని వారికి
తోచినప్పటికిన్ని యేసు అతని మరణమును గురించి
పలికెను.
అంతట యేసు—లాజరు చనిపోయెను. మీరు ౧౪
నమ్మేకొరకు నేను అక్కడ వుండలేదని మీ నిమి
త్తము సంతోషిస్తున్నాను అయినప్పటికిన్ని ఆయన ౧౫
యొద్దికి వెళ్లుదామని వారితో స్పష్టముగా చెప్పె
ను. అందుచేతను దిదుము అనబడిన థోమ ఆయ ౧౬
నతో చనిపోయే కొరకు మనము కూడా వెళ్లుదా
మని తోటి శిష్యులతో పలికెను.
అప్పుడు యేసు వచ్చి అంతకు మునుపు ఆయన ౧౭
నాలుగు దినములు సమాధిలో పడి యుండెనని
తెలుసుకొనెను. బేథనియ యెరూశలేముకు ౧౮
సమీపమై యుండెను దానికి కొంచెము యెక్కువ
తక్కువ వొక కోసు దూరము గనుక యూదుల ౧౯
లో అనేకులు మార్థా మరియ అనే వారి సహో
దరుని గురించి వారిని పరామర్శించేకొరకు వారి
యొద్దికి వచ్చియుండిరి. అప్పుడు మార్థ యేసు ౨౦
వస్తున్నాడని విని ఆయనను యెదురుకొనుటకు
వెళ్లెను అయితే మరియ యింటిలో కూర్చుని

౨౧ యుండెను. అప్పుడు మర్థా—ప్రభువా నీవు
యిక్కడ వుండినట్టయితే నా సహోదరుడు చా
౨౨ వక వుండును. అయితే నేమి నీవు వేటిని దేవుని
అడిగినప్పటికిన్ని యిప్పుడున్ను దేవుడు వాటిని
నీకు యిచ్చునని యెరుగుదునని యేసుతో చెప్పె
౨౩ ను. అందుకు యేసు—నీ సహోదరుడు తిరిగీ
౨౪ లేచునని ఆమెతో చెప్పినప్పుడు మర్థా—అంత్య
దినమందు పునరుత్థానమయేటప్పుడు లేచునని యె
౨౫ రుగుదునని ఆయనతో చెప్పెను. అందుకు యే
సు—నేనే పునరుత్థానమున్ను జీవమున్నైయున్నా
ను. నాయందు విశ్వాసముంచేవాడు చనిపోయి
౨౬ నప్పటికిన్ని జీవించును. మరిన్ని జీవించి నా
యందు విశ్వాసముంచే ప్రతివాడున్ను యెన్నటి
కిన్ని చనిపోడు దీని నమ్ముతున్నావా అని ఆమెతో
౨౭ పలికినప్పుడు ఆమె—అవును ప్రభువా యీ లోక
మునకు రావలసిన దేవుని కుమారుడవైన క్రీస్తువై
యున్నావని నేను నమ్మి యున్నానని ఆయనతో
చెప్పెను.
౨౮ ఆమె వీటిని చెప్పి వెళ్లి తన సహోదరియైన
మరియను రహస్యముగా పిలిచి—బోధకుడు వచ్చి
౨౯ నిన్ను పిలుస్తున్నాడని చెప్పెను. ఆమె విని త్వర
౩౦ గా లేచి ఆయన యొద్దికి వచ్చెను. అయితే యేసు
యింకా ఆ వూరిలోకి ప్రవేశించక మర్థా ఆయ
౩౧ నను కలుసుకొనిన స్థలమందే వుండెను గనుక యిం
ట్లో ఆమె యొద్దవుండి ఆమెను పరామర్శించే
యూదులు మరియ త్వరగా లేచి వెళ్లుట చూచి—
ఆమె సమాధి యొద్ద యేడ్చేకొరకు అక్కడికి వెళ్లు
తున్నది గదా అని చెప్పుకొంటూ ఆమెను వెంబ
౩౨ డించిరి. అంతట మరియ యేసు వున్న చోటుకు
వచ్చి ఆయనను చూచి ఆయన పాదముల మీద
పడి—ఓ ప్రభువా నీవు యిక్కడ వుండినట్టయితే
నా సహోదరుడు చావక వుండునని ఆయనతో
పలికెను.
౩౩ కాబట్టి యేసు ఆమె యేడ్చుటనున్ను ఆమెతో
వచ్చిన యూదులు యేడ్చుటనున్ను చూచి ఆత్మలో
మూలుగుతూ కలతపడి—ఆయనను యెక్కడ వుం
౩౪ చితిరని పలికినప్పుడు వారు—ప్రభువా నీవు వచ్చి
౩౫ చూడుమని ఆయనతో చెప్పిరి. యేసు యేడ్చెను.
౩౬ కాబట్టి యూదులు—ఇదిగో ఆయనను యేలాగు
౩౭ ప్రేమించెనని పలికిరి. అయితే వారిలో కొంద
రు—ఆ గుడ్డివాని కన్నులు తెరవచేసిన యీయన
యితడున్ను చావకుండా చేయ లేడా అని పలికిన
౩౮ ప్పుడు యేసు తిరిగీ తనలో మూలుగుతూ సమాధి
యొద్దికి వచ్చెను. అది గుహ. దాని మీద వొక
రాయి వుంచబడెను. అప్పుడు యేసు—ఆ రాయి ౩౯
తీసి వేయండని చెప్పినప్పుడు చనిపోయిన వాని
సహోదరియైన మర్థా—ప్రభువా ఆయన చని
పోయి నాలుగు దినములాయెను గనుక యిప్పటికి
వాసన వేసునని ఆయనతో చెప్పెను. అందుకు ౪౦
యేసు—నీవు నమ్మినట్టయితే దేవుని మహిమ చూతు
వని నేను నీతో చెప్పలేదా అని ఆమెతో పలి
కెను. కాబట్టి చనిపోయినవాడు వుంచబడిన చో ౪౧
టునుంచి ఆ రాయి తోసినప్పుడు యేసు తన
కన్నులు పైకెత్తి—ఓ తండ్రీ నీవు నా మనవి విన్నం
దున నిన్ను స్తుతిస్తున్నాను. నీవు యెప్పుడున్ను ౪౨
నా మనవి వింటున్నావని యెరుగుదును అయితే
చుట్టూ వున్న యీ ప్రజల నిమిత్తము—నీవు నన్ను
పంపితివని వారు నమ్మేకొరకు చెప్పితినని పలికెను.
ఆయన వీటిని పలికి—లాజరూ బయిటికి రమ్మని ౪౩
నోరెత్తి పిలిచెను. అప్పుడు చనిపోయిన వాడు ౪౪
కాళ్లున్ను చేతులున్ను ప్రేత వస్త్రములతో కట్ట
బడిన వాడై వెలపటికి వచ్చెను. ఆయన ముఖము
కూడా రుమాలుతో కట్టబడెను. అప్పుడు యేసు—
మీరు ఆయనను విప్పి నడువనివ్వండి అని వారితో
చెప్పెను.
కాబట్టి మరియ యొద్దికి వచ్చి యేసు చేసిన ౪౫
వాటిని చూచిన యూదులలో అనేకులు ఆయన
యందు విశ్వాసముంచిరి. అయితే వారిలో కొం ౪౬
దరు ఫరిసైయుల యొద్దికి వెళ్లి యేసు చేసిన వా
టిని వారితో చెప్పిరి.
కాబట్టి ప్రధాన యాజకులున్ను ఫరిసైయులు ౪౭
న్ను సభను కూర్చి—మనము యేమి చేయుదము
యీ మనుష్యుడు అనేకమైన అద్భుతములను చేస్తు
న్నాడు. మనము ఆయనను యీలాగు విడిచినట్ట ౪౮
యితే అందరు ఆయన యందు విశ్వాసముంతురు
అప్పుడు రోమీయులు వచ్చి మన స్థలమునున్ను
దేశమునున్ను తీసివేతురని పలికిరి. అయితే వారి ౪౯
లో కాయిఫ అనే వొకడు ఆ సంవత్సరమందు ప్ర
ధాన యాజకుడై యుండి—మీరు యేమిన్ని యెరు
గరు యీ దేశ జనమంతా నశించక వుండుటకు వొక ౫౦
మనుష్యుడు ప్రజల కొరకు చనిపోవుట మనకు
వుపయోగమైయున్నదని యోచించుకొనరని వారి
తో చెప్పెను. తనకు తానే యిది చెప్ప లేదు ౫౧
అయితే ఆ సంవత్సరమందు ప్రధానయాజకుడై
యుండెను గనుక యేసు ఆ దేశ జనము కొరకున్ను ౫౨
ఆ దేశ జనము కొరకు మాత్రమే కాకుండా చెదిరి
పోయిన దేవుని పిల్లలను యేకముగా కూర్చేకొర

౫౩ కున్ను చావనైయున్నాడని ప్రవచించెను. కా
బట్టి ఆ దినమునుంచి ఆయనను చంపుటకు వారు
ఆలోచించుకొనిరి.
౫౪ కాబట్టి యేసు యూదులలో అప్పటినుంచి
బహిరంగముగా సంచరించక అక్కడనుంచి అర
ణ్యమునకు సమీపమైన ప్రదేశములో వున్న ఎఫ్ర
యిమనే పేరు గల వొక వూరికి వెళ్లి అక్కడ తన
శిష్యులతో కూడా నివసించెను.
౫౫ మరిన్ని యూదుల పస్కా సమీపమై యుండె
ను గనుక అనేకులు తమ్మును తామే శుచి చేసుకొ
నేకొరకు పస్కాకు మునుపు పల్లెటూళ్లలోనుంచి
౫౬ యెరూశలేముకు వెళ్లిరి. అంతట వారు యేసును
వెతుకుతూ—మీకేమి తోస్తున్నది ఆయన పండు
గకు రాడా అని గుడిలో నిలువబడి వొకనితో
౫౭ వొకడు చెప్పుకొంటూ వుండిరి. మరిన్ని ప్రధాన
యాజకులున్ను ఫరిసైయులున్ను ఆయన యెక్కడ
వున్నాడో అది యెవనికైనా తెలిసియుంటే తాము
ఆయనను పట్టుకొనే కొరకు తెలియ చేయ వలె
నని ఆజ్ఞ యిచ్చి యుండిరి.

## ౧౨ పర్వము.

అంతట చనిపోయిన తరువాత యేసు మృతుల
లోనుంచి లేపిన లాజరు వున్న బేథనియకు యేసు
౨ పస్కాకు ఆరు దినముల కిందట వచ్చెను గనుక
వారు అక్కడ ఆయనకు వొక విందు చేసినప్పుడు
మార్థా పరిచర్య చేసెను అయితే లాజరు ఆయ
నతో కూడా పఙ్తిలో కూర్చున్న వారిలో వొకడు.
౩ అప్పుడు మరియ మిక్కిలి విలువగల శుద్ధమైన
జటామాంసి అత్తరు వొక శేరు పుచ్చుకొని యేసు
పాదములకు పూసి తన తల వెంట్రుకలతో ఆయన
పాదములను తుడిచెను. అప్పుడు ఆ యిల్లు ఆ
౪ యత్తరు వాసనతో నిండుకొనెను. కాబట్టి ఆయ
నను అప్పగించనై యున్న సీమోను కుమారుడయిన
యూదా ఇస్కరియోతనే ఆయన శిష్యులలో వొ
౫ కడు—ఈ అత్తరు యెందుకు మున్నూరు దీనార
ములకు* అమ్మబడి బీదలకు యివ్వబడ లేదని చెప్పె
౬ ను. అయితే అతడు బీదల కొరకు చింతించుట
వల్ల కాదు అయితే అతడు దొంగయై వారి సొమ్ము
సంచి పట్టుకొని దానిలో వేయబడినవి మోసే
౭ వాడు గనుక ఆలాగు పలికెను. కాబట్టి యేసు—
ఆమెను విడువండి నేను పూడ్చబడే దినమునకు
౮ ఆమె దీని వుంచుకొనెను యెందుకంటే బీదలు
యెల్లప్పుడున్ను మీతో వున్నారు అయితే నేను
యెల్లప్పుడున్ను వుండనని పలికెను.
కాబట్టి యూదులలో బహుజనసమూహము ౯
ఆయన అక్కడ వున్నాడని తెలుసుకొని యేసు
నిమిత్తము మాత్రమే కాకుండా ఆయన చనిపో
యిన వారిలో నుంచి లేపిన లాజరును కూడా
చూచే కొరకున్ను వచ్చెను.
అయితే ప్రధాన యాజకులు లాజరునున్ను చంపు ౧౦
టకు ఆలోచించిరి యెందుకంటే ఆయనవల్ల యూ ౧౧
దులలో అనేకులు వెళ్లి యేసు యందు విశ్వాస
ముంచిరి.
మరునాడు ఆ పండుగకు వచ్చిన బహు జన ౧౨
సమూహము యేసు యెరూశలేముకు వస్తున్నాడని
విని ఖర్జూరపు మట్టలు పట్టుకొని ఆయనను యె ౧౩
దురుకొనుటకు బయలువెళ్లి—హోసన్నా! ప్రభు
వుయొక్క పేరట వచ్చే ఇశ్రాయేలు రాజు స్తు
తించ బడునుగాక అని కేకలు వేసిరి. మరిన్ని— ౧౪
సీయోను కొమార్తె భయపడకుము యిదుగో నీ ౧౫
రాజు గాడిదె పిల్ల మీద కూర్చుని వస్తున్నాడని
వ్రాయబడిన ప్రకారము యేసు వొక చిన్న గాడి
దెను తెప్పించుకొని దాని యెక్కి కూర్చుండెను.
ఇవి ఆయన శిష్యులకు మొదట బోధపడ లేదు ౧౬
అయితే యేసు మహిమపరచబడినప్పుడు యివి
ఆయనను గురించి వ్రాయబడెననిన్ని ఆయనకు
వీటిని చేసిరనిన్ని వారు జ్ఞాపకము చేసుకొనిరి.
కాబట్టి ఆయనతో కూడా వున్న జనసమూ ౧౭
హము సాక్ష్యమిచ్చెను యెందుకంటే లాజరును ౧౮
సమాధిలోనుంచి పిలిచి ఆయనను మృతులలోనుంచి
లేపెను. అందు చేతనే జనసమూహము ఆయన
ఆ యద్భుతము చేసెనని విన్నందున ఆయనను యె
దురుకొనుటకు వెళ్లెను. గనుక ఫరిసైయులు— ౧౯
మీరు యేమిన్ని కొన సాగించ లేదని చూచితిరా.
ఇదుగో లోకము ఆయన వెంట వెళ్లెనని వొకనితో
వొకడు చెప్పుకొనిరి. మరిన్ని ఆ పండుగలో ౨౦
ఆరాధించే కొరకు వచ్చినవారిలో కొందరు హెల్లే
నీయులు వుండిరి. అంతట వారు గలిలైయలో ౨౧
వున్న బేథ్సయిదనే వూరివాడైన ఫిలిప్పు యొద్దికి
వచ్చి—అయ్యా మేము యేసును చూడ కోరుతు
న్నామని ఆయనను వేడుకొనిరి. ఫిలిప్పు వచ్చి ౨౨
అంద్రెయతో చెప్పెను. తిరిగి అంద్రెయయున్ను
ఫిలిప్పున్ను యేసుతో చెప్పిరి. అందుకు యేసు ౨౩
ప్రత్యుత్తరముగా వారితో—మనుష్య కుమారుడు

* అనగా, కొంచము తక్కువ నూరు రూపాయీలు కావచ్చును.

౨౪ మహిమ పొందే గడియ వచ్చెను. నిజమే నిజమే
నేను మీతో చెప్పేది యేమంటే గోధుమ గింజ
భూమిలో పడి చావక పోతే అది వొంటిగా వుం
డును అయితే అది చచ్చినట్టయితే విస్తార ఫలము
౨౫ యిచ్చును. తన ప్రాణమును ప్రేమించే వాడు
దాని పోగొట్టుకొనును. ఈ లోకములో తన
ప్రాణమును ద్వేషించే వాడు నిత్యజీవము కొరకు
౨౬ దాని కాపాడుకొనును. నన్ను యెవడైనా సేవిం
చినట్టయితే నన్ను వెంబడించవలెను అప్పుడు నేను
యెక్కడ వున్నానో అక్కడ నా సేవకుడున్ను
వుండును. నన్ను యెవడైనా సేవించినట్టయితే నా
౨౭ తండ్రి ఆయనను ఘనపరుచును. ఇప్పుడు నా
ప్రాణము కలతపడుతున్నది. నేను యేమందు
ను—తండ్రీ యీ గడియనుంచి నన్ను రక్షించు
ము*—అయితే దీని నిమిత్తము యీ గడియకు వచ్చి
౨౮ తిని. ఓ తండ్రీ నీ నామమును మహిమపరుచు
మని చెప్పెను. అంతట—నేను దాని మహిమ
పరిచితిని తిరిగీ మహిమపరుతునని వొక శబ్దము
౨౯ ఆకాశమునుంచి వచ్చెను. కాబట్టి అక్కడ నిలిచి
వినిన ప్రజలు వురుము వుట్టెనని చెప్పుకొనిరి.
మరి కొందరు వొక దూత ఆయనతో పలికెనని
౩౦ చెప్పుకొనిరి. అందుకు యేసు—ఈ శబ్దము మీ
౩౧ కొరకే గాని నా కొరకు కలిగినది కాదు. ఇప్పు
డు యీ లోకమును గూర్చిన న్యాయపు తీర్పు
వున్నది. ఇప్పుడు యీ లోకాధిపతి బైట వేయ
౩౨ బడును. మరిన్ని నేను భూమి మీదనుంచి పైకె
త్తబడినట్టయితే అందరినిన్ని నా యొద్దికి లాగు
౩౩ కొందునని ప్రత్యుత్తరమిచ్చెను. తాను యేలాటి
మరణమువల్ల చనిపోవనై యుండెనో అది సూచిం
చుటకు దీని చెప్పెను.

౩౪ కాబట్టి జనసమూహము—క్రీస్తు యెల్లప్పుడున్ను
వుండునని ఆజ్ఞాప్రమాణమువల్ల వింటిమి గనుక
మనుష్యకుమారుడు యెత్తబడ వలెనని నీవు యేల
చెప్పుతున్నావు. మనుష్యకుమారుడైన యీయన
౩౫ యెవడని ఆయనను ప్రత్యుత్తరమిచ్చిరి. అంతట
యేసు—ఇంకా కొంత కాలము వెలుగు మీలో
వుండును చీకటి మిమ్మును కమ్మక వుండే కొరకు
వెలుగు మీకు కలిగే పర్యంతము నడువండి. చీక
టిలో నడిచే వానికి తాను వెళ్లే చోటు తెలియదు.
౩౬ మీరు వెలుగు కుమాళ్లయే నిమిత్తము వెలుగు మీకు
కలిగేపర్యంతము వెలుగు యందు విశ్వాసముంచండి
అని వారితో చెప్పెను. యేసు వీటిని చెప్పి వెళ్లి
వారికి మరుగైపోయెను. అయితే ఆయన వారి ౩౭
యెదుట యిన్ని అద్భుతములను చేసినప్పటికిన్ని
వారు ఆయన యందు విశ్వాసముంచ లేదు. అం ౩౮
దువల్ల—ప్రభువా మా వర్తమానము నమ్మిన వాడె
వడు ప్రభువు యొక్క బాహువు యెవనికి బయి
లుపరచ బడెనని ప్రవక్తయైన యెషయా పలికిన
వాక్యము నెరవేర్చబడెను. అందువల్ల వారు ౩౯
నమ్మలేక పోయిరి యెందుకంటే—వారు కన్నుల ౪౦
చూచి హృదయమున గ్రహించి మళ్లుకొని నా వల్ల
స్వస్థపరచబడక వుండేకొరకు ఆయన వారి కన్ను
లు గుడ్డిచేసి వారి హృదయమును కఠినపరిచెనని
యెషయా తిరిగీ పలికెను. యెషయా ఆయన ౪౧
మహిమను చూచినప్పుడు వీటిని చెప్పెను అప్పుడు
ఆయనను గురించి పలికెను. అయినప్పటికిన్ని అధి ౪౨
కారులలోనున్ను అనేకులు ఆయన యందు విశ్వా
సముంచిరి. అయితే సునగోగులోనుంచి వెలి
వేయబడక వుండే కొరకు ఫరిసైయుల (భయము)
వల్ల ఆలాగు వొప్పుకొన లేదు యెందుకంటే దేవుని ౪౩
మెప్పు† కంటే మనుష్యుల మెప్పు† యెక్కువగా
ప్రేమించిరి.

మరిన్ని యేసు—నా యందు విశ్వాసముంచే ౪౪
వాడు నా యందు కాదు నన్ను పంపిన వాని
యందు విశ్వాసముంచును. నన్ను చూచేవాడు ౪౫
నన్ను పంపినవాని చూస్తున్నాడు. నా యందు ౪౬
విశ్వాసముంచేవాడెవడో వాడు చీకటిలో నిలు
వక వుండేకొరకు నేను యీ లోకమునకు వెలుగునై
వచ్చియున్నాను. మరిన్ని యెవడైనా నా మా ౪౭
టలు విని నమ్మకపోతే నేను ఆయనకు తీర్పు
చేయను యెందుకంటే నేను లోకమును రక్షించు
టకేగాని లోకమునకు తీర్పు చేయుటకు రాలేదు.
నన్ను తిరస్కరించి నా మాటలు అంగీకరించని ౪౮
వానికి తీర్పు చేసేవాడు వొకడు కలడు నేను పలి
కిన మాట అంత్య దినమందు వానికి తీర్పు కలుగ
చేసును యెందుకంటే నాకు నేనే పలుకలేదు ౪౯
అయితే నేను యేమన వలెనో యేమి పలుకవలె
నో దాని గురించి ఆయన అనగా నన్ను పంపిన
తండ్రి నాకు ఆజ్ఞను యిచ్చి యున్నాడు. మరి ౫౦
న్ని ఆయన ఆజ్ఞ నిత్యజీవమై యున్నదని యెరుగు
దును గనుక వాటిని తండ్రి నాతో యేలాగు
చెప్పెనో ఆలాగే నేను పలికేవి పలుకుతున్నా
నని చెప్పెను.

* లేక, రక్షింతుమందునా. † లేక, వల్లనైన ఘనము.

## ౧౩ పర్వము.

మరిన్ని పస్కా అనే పండుగకు ముందు యేసు
తాను యీ లోకమునుంచి తండ్రియొద్దికి వెళ్లవల
సిన తన గడియ వచ్చెనని యెరిగి లోకములోవున్న
తన వారిని ప్రేమించి తుద మట్టుకున్ను వారిని
౨ ప్రేమించెను. అప్పుడు ఆయనను అప్పగించే
కొరకు సైతాను సీమోను కుమారుడైన యూదా
ఇష్కరియోతుయొక్క హృదయములో తలంపు
పుట్టించిన తరువాత భోజనము సిద్ధమైయున్నప్పు
౩ డు యేసు తన చేతికి తండ్రి సమస్తమున్ను అప్ప
గించెననిన్ని తాను దేవుని యొద్దనుంచి బయిలుదేరి
వచ్చి దేవునియొద్దికి వెళ్లుదుననిన్ని యెరిగి భోజన
౪ మునుంచి లేచి పై బట్టలు తీసివేసి వొక రుమాలు
౫ పట్టుకొని నడుము కట్టుకొనెను. అప్పుడు ఆయన
వొక పళ్లెములో నీళ్లు పోసి శిష్యుల పాదములను
కడుగుటకున్ను తాను కట్టుకొనియున్న రుమాలు
౬ తో వాటిని తుడుచుటకున్ను ఆరంభించెను. కా
బట్టి ఆయన సీమోను పేతురుయొద్దికి వచ్చినప్పుడు
అతడు—ప్రభువా నీవు నా పాదములు కడుగు
౭ తున్నావా అని ఆయనతో పలికెను. అందుకు
యేసు—నేను యేమి చేస్తున్నానో అది యిప్పుడు
నీకు తెలియదు అయితే వీటి పిమ్మట యెరుగుదు
౮ వని అతనికి ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు పేతు
రు—నీవు యెన్నడున్ను నా పాదములు కడుగకూడ
దని ఆయనతో పలికినప్పుడు యేసు—నేను నిన్ను
కడిగితేనేగాని నాతో పాలు పొందవని చెప్పెను.
౯ అందుకు సీమోను పేతురు—ప్రభువా నా పాద
ములు మాత్రమే కాదు నా చేతులున్ను తలయు
౧౦ న్ను కడుగుమని చెప్పెను. యేసు—శిరస్నానము
పొందిన వానికి పాదములేగాని మరి యేదిన్ని కడు
గుకొనక్కరలేదు అయితే అతడు కేవలము పవి
త్రుడై యున్నాడు అటువలె మీరున్ను పవిత్రులై
౧౧ యున్నారు అయితే మీలో అందరు కారని అత
నితో చెప్పెను యెందుకంటే తన్ను అప్పగించనై
యున్న వాని యెరిగెను అందుచేతను—మీరందరు
పవిత్రులు కారని చెప్పెను.
౧౨ కాబట్టి వారి పాదములు కడిగి తన పై బట్టలు
వేసుకొన్న తరువాత ఆయన తిరిగి కూర్చుని—
౧౩ నేను మీకు చేసినది మీకు తెలుసునా. మీరు
నన్ను బోధకుడనిన్ని ప్రభువనిన్ని పిలుస్తున్నారు
నేను అలాటి వాడను గనుక మీరు బాగా చెప్పు
౧౪ తున్నారు. కాబట్టి ప్రభువునున్ను బోధకుడ
నున్నైన నేను మీ పాదములు కడిగినట్టయితే మీ ౧౫
రున్ను వొకని పాదములు వొకడు కడుగతగ్గది
యెందుకంటే నేను మీకు చేసిన ప్రకారము మీ
రున్ను చేసేనిమిత్తము మీకు దృష్టాంతము యిచ్చి
యున్నాను. నిజమే నిజమే నేను మీతో ౧౬
చెప్పేది యేమంటే—దాసుడు తన యజమానుని
కంటే అధికుడు కాడు అపొస్తలు* తన్ను పంపిన
వానికంటే అధికుడు కాడు. ఇవి మీకు తెలిసిన ౧౭
పక్షమందు వాటిని చేసినట్టయితే మీరు భాగ్య
వంతులవుదురు. మిమ్మునందరిని గురించి పలుకు ౧౮
తున్నాను కాను నేను యేర్పరచుకొన్న వారిని
యెరుగుదును. అయితే నాతోకూడా రొట్టె
తినేవాడు నాకు విరోధముగా తన మడమ యె
త్తెననే—లేఖనము నెరవేర్చబడవలెను. అయితే ౧౯
అది కలిగినప్పుడు నేను ఆయననని† మీరు నమ్మే
నిమిత్తము కలగక మునుపు అది మీతో చెప్పుతు
న్నాను. నేను యెవని పంపుదునో వాని చేర్చు ౨౦
కొనేవాడు నన్ను చేర్చుకొనును నన్ను చేర్చుకొనే
వాడు నన్ను పంపినవాని చేర్చుకొనునని నిజమే
నిజమే మీతో చెప్పుతున్నాను అని వారితో
పలికెను.

యేసు వీటిని చెప్పి తన ఆత్మలో కలతపడి— ౨౧
మీలో వొకడు నన్ను అప్పగించునని నిజమే నిజమే
మీతో చెప్పుతున్నానని సాక్ష్యమిచ్చి పలికెను.
ఆయన యెవని గురించి పలికెనో దానికి శిష్యులు ౨౨
సందేహపడి వొకని తట్టు వొకడు చూస్తూవుండిరి.
అయితే ఆయన శిష్యులలో యేసుకు ప్రియుడైన ౨౩
వొకడు యేసు రొమ్మును ఆనుకొంటూ వుండెను
గనుక యెవని గురించి ఆయన పలికెనో దాని ౨౪
తెలుసుకొమ్మని సీమోను పేతురు అతనికి సైగచేసె
ను. అప్పుడు ఆయన యేసు రొమ్మున ఆనుకొం ౨౫
టూ—ప్రభువా అతడు యెవడని ఆయనతో పలి
కెను. అందుకు యేసు—నేను వొక ముక్క ముంచి ౨౬
యెవనికి యిత్తునో అతడే అని చెప్పి వొక ముక్క
ముంచి సీమోను కుమారుడైన యూదా ఇష్కరి
యోతుకు యిచ్చెను. ఆ ముక్క తరువాత సైతా ౨౭
ను అతనిలో ప్రవేశించెను. అప్పుడు యేసు—
నీవు యేమి చేస్తున్నావో దాని త్వరగా చేయు
మని అతనితో చెప్పెను. అయితే ఆయన దేని ౨౮
నిమిత్తము అతనితో దీని చెప్పెనో అది పఙ్క్తిలో
కూర్చున్న వారిలో యెవనికిన్ని తెలియ లేదు
యెందుకంటే సొమ్ము సంచి యూదాయొద్ద వుండె ౨౯

* లేక—పంపబడినవాడు. † లేక, యేమైయున్నానో.

మ గనుక—పండుగకొరకు మనకు కావలసిన వా
టిని కొనుమనియైనా లేక బీదలకు కొంచెము యి
వ్వవలెననియైనా యేసు అతనితో చెప్పెనని కొం
3౦ దరు తలంచుకొనిరి. అంతట అతడు ఆ ముక్క
పుచ్చుకొని వెంటనే బయిలు వెళ్లెను. అప్పుడు
రాత్రియై యుండెను.
3౧ అతడు బయిలువెళ్లిన తరువాత యేసు—ఇప్పుడు
మనుష్యకుమారుడు మహిమపరచబడెను దేవుడు
3౨ న్ను ఆయనవల్ల మహిమపరచబడెను. దేవుడు
ఆయనయందు మహిమపరచబడినట్టయితే అప్పుడు
దేవుడు తనయందు ఆయనను మహిమపరుచును—
33 శీఘ్రముగా ఆయనను మహిమపరుచును. పిల్ల
లారా యింకా కొంత కాలము మీతోకూడా
వున్నాను మీరు నన్ను వెతుకుదురు నేను యెక్క
డికి వెళ్లుదునో అక్కడికి మీరు రాలేరని నేను
యూదులతో చెప్పిన ప్రకారము యిప్పుడు మీ
3౪ తోనున్ను చెప్పుతున్నాను. మీకు క్రొత్త ఆజ్ఞ
యిస్తున్నాను అదేమంటే—వొకని వొకడు ప్రే
మించండి నేను మిమ్మును ప్రేమించినలాగున మీ
3౫ రున్ను వొకని వొకడు ప్రేమించండి. మీరు వొ
కని వొకడు ప్రేమించినట్టయితే దీనివల్ల మీరు నా
శిష్యులై యున్నారని అందరున్ను తెలుసుకొందు
3౬ రని చెప్పెను. సీమోను పేతురు—ప్రభువా నీవు
యెక్కడికి వెళ్లుతున్నావని ఆయనతో పలికినం
దుకు యేసు—నేను వెళ్లే చోటుకు నీవు యిప్పుడు
నన్ను వెంబడించలేవు అయితే మరి యొకప్పుడు
నన్ను వెంబడింతువని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చె
3౭ ను. అందుకు పేతురు—ప్రభువా యిప్పుడు
నేను యెందుకు నిన్ను వెంబడించ లేను. నీ కొ
3౮ రకు నా ప్రాణము పెట్టుదునని చెప్పెను. యేసు
అతనికి ప్రత్యుత్తరమిచ్చినదేమంటే—నా కొరకు
నీ ప్రాణము పెట్టుదువా నన్ను గురించి—వాని
యెరగనని నీవు మూడు మార్లు పలికే పర్యం
తము కోడి కూయదని నిజమే నిజమే నీతో
చెప్పుతున్నాను.

## ౧౪ పర్వము.

మీ హృదయము కలతపడనివ్వకండి దేవుని
యందు విశ్వాసముంచండి నా యందున్ను విశ్వా
౨ సముంచండి. నా తండ్రి యింటిలో అనేక నివా
సములు వున్నవి లేకుంటే మీతో చెప్పుదును యెం
దుకంటే మీకు స్థలము సిద్ధపరుచుటకు వెళ్లుతు
3 న్నాను. నేను వెళ్లి మీకు స్థలము సిద్ధపరిచినట్ట
యితే నేను వుండే స్థలములో మీరున్ను వుండే
కొరకు తిరిగీ వచ్చి మిమ్మును నా యొద్దికి చేర్చు
కొందును. నేను యెక్కడికి వెళ్లుతున్నానో అది ౪
మీకు తెలుసును ఆ మార్గము మీకు తెలుసునని ౫
పలికినప్పుడు థోమా—ప్రభువా యెక్కడికి వెళ్లు
తున్నావో అది మాకు తెలియదు ఆ మార్గము
యేలాగు తెలుసుకొన గలమని ఆయనతో పలి
కెను. యేసు—నేను మార్గమున్ను సత్యమున్ను ౬
జీవమున్నై యున్నాను. నావల్లనే గాని యెవ ౭
డున్ను తండ్రి యొద్దికి రాడు. మీరు నన్ను యెరిగి
నట్టయితే నా తండ్రినిన్ని యెరుగుదురు. ఇప్పటి
నుంచి ఆయనను యెరుగుదురు మరిన్ని ఆయనను
చూచి యున్నారని అతనితో చెప్పెను.
అందుకు ఫిలిప్పు—ప్రభువా తండ్రిని మాకు ౮
అగుపరుచుము అది మాకు చాలునని ఆయనతో
పలికినప్పుడు యేసు—ఫిలిప్పా నేను యింతకాల ౯
ము మీ యొద్ద వున్నప్పటికిన్ని నీవు నన్ను తెలుసు
కొన లేదా. నన్ను చూచిన వాడు తండ్రిని చూచి
యున్నాడు గనుక తండ్రిని మాకు అగుపరుచు
మని యేల చెప్పుతున్నావు. తండ్రియందు నేను ౧౦
న్ను నా యందు తండ్రియున్ను వున్నామని నీవు
నమ్మలేదా. నేను మీతో పలుకుతూ వున్న మా
టలు నా యంతట నేనే చెప్ప లేదు అయితే నా
యందు నివసించే తండ్రి యీ కార్యములు చేస్తు
న్నాడు. తండ్రియందు నేనున్ను నా యందు ౧౧
తండ్రియున్ను వున్నామని నమ్మండి లేకుంటే యీ
కార్యములవల్ల నన్ను నమ్మండి. నిజమే నిజమే ౧౨
నేను మీతో చెప్పేది యేమంటే—నేను చేసే క్రి
యలు నా యందు విశ్వాసముంచే వాడున్ను చేసు
ను. వీటికంటే అతడు గొప్ప వాటిని చేసును.
యెందుకంటే నేను నా తండ్రి యొద్దికి వెళ్లుతు
న్నాను. మీరు నా నామమున దేని అడుగుదురో ౧3
తండ్రి కుమారునివల్ల మహిమపరచబడే నిమిత్తము
దాని చేతును. నా నామమున యేమి అడిగినప్ప ౧౪
టికిన్ని నేను చేతును.
నన్ను ప్రేమించినట్టయితే నా యాజ్ఞలను గై ౧౫
కొనండి. మరిన్ని నేను తండ్రిని వేడుకొందును.
అప్పుడు మీ యొద్ద యెల్లప్పుడున్ను వుండుటకు ౧౬
ఆయన మీకు వేరొక సహాయకుని* అనగా సత్యపు
ఆత్మను యిచ్చును. లోకము దాని చూడదు దాని ౧౭
యెరుగదు గనుక దాని పొంద నేరదు అయితే
మీరు దాని యెరుగుదురు యెందుకంటే మీతో

* లేక, ఆదరణకర్త.

నివసిస్తున్నది మరిన్ని మీలో వుండును. మిమ్మును
౧౮ అనాథులగా విడువను మీ యొద్దికి వత్తును. మరి
కొంత కాలమైన తరువాత లోకము నన్ను మరి
౧౯ యెన్నడున్ను చూడదు. అయితే మీరు నన్ను
చూతురు. నేను బ్రతుకుదును గనుక మీరున్ను
౨౦ బ్రతుకుదురు. నేను నా తండ్రియందున్ను మీరు
నా యందున్న నేను మీయందున్ను వుండుట ఆ
౨౧ దినమున మీరు యెరుగుదురు. నా యాజ్ఞలు కలిగి
వాటిని గైకొనే వాడే నన్ను ప్రేమిస్తున్నాడు.
నన్ను ప్రేమించే వాడు నా తండ్రి వల్ల ప్రే
మించబడును. నేనున్ను అతని ప్రేమించి అత
నికి నన్ను అగుపరుచుకొందునని పలికెను.
౨౨ ఇస్కరియోతు కాని యూదా—ఓ ప్రభువా
నీవు లోకమునకు కాకుండా మాకే నిన్ను అగుపరు
చుకొన బోవుటకు యేమి సంభవించెనని పలికె
౨౩ ను. అందుకు యేసు అతనికి ప్రత్యుత్తరమిచ్చినది
యేలాగంటే—యెవడైనా నన్ను ప్రేమించినట్ట
యితే నా మాట గైకొనును అప్పుడు నా తండ్రి
అతని ప్రేమించును మేము అతని యొద్దికి వచ్చి
౨౪ అతని యొద్ద నివాసము చేతుము. నన్ను ప్రేమిం
చని వాడు నా మాటలు గైకొనడు మరిన్ని మీరు
వినే మాట నాది కాదు నన్ను పంపిన తండ్రిదై
౨౫ యున్నది. మీయొద్ద నివసిస్తూ వీటిని మీతో
౨౬ పలికి యున్నాను అయితే తండ్రి నా నామమున
పంప గల పరిశుద్ధాత్మ అనే సహాయకుడు* సమస్త
మున్ను మీకు బోధపరిచి నేను మీతో పలికినవ
౨౭ న్నిన్ని మీకు జ్ఞాపకము చేసును. సమాధాన
మును† మీకు విడిచి పెట్టుతున్నాను నా సమా
ధానమును మీకు యిస్తున్నాను. లోకము యిచ్చే
ప్రకారము నేను మీకు యివ్వను. మీ హృద
యము కలతపడనివ్వకండి భయపడనివ్వకండి.
౨౮ నేను వెళ్లి తిరిగీ మీ యొద్దికి వత్తునని నేను మీతో
పలికిన దాని వింటిరి. నన్ను ప్రేమించినట్టయితే
నేను తండ్రియొద్దికి వెళ్లుతున్నందున సంతోషిం
తురు యెందుకంటే నా తండ్రి నా కంటే గొప్ప
౨౯ వాడు. అది సంభవించినప్పుడు మీరు నమ్మేకొ
రకు అది సంభవించక మునుపు మీతో పలికి యు
౩౦ న్నాను. ఇకమీదట నేను మీతో విస్తరించి మా
ట్లాడను యెందుకంటే యీ లోక నాథుడు వస్తు
న్నాడు అయితే నాయందు అతనికి కలిగినది యే
దిన్ని లేదు. అయినప్పటికిన్ని నేను తండ్రిని ౩౧
ప్రేమిస్తున్నానని లోకము తెలుసుకొనే కొరకు
తండ్రి నాకు యేలాగు ఆజ్ఞాపించెనో ఆలాగే చేస్తు
న్నాను. లేవండి యిక్కడనుంచి వెళ్లుదాము.‡

## ౧౫ పర్వము.

నేను నిజమైన ద్రాక్షావల్లిని నా తండ్రి వ్యవ ౧
సాయకుడైయున్నాడు. నాయందు యే తీగె ఫలిం ౨
చదో దాని ఆయన తీసివేసును యే తీగె ఫలించు
నో అది మరీ యెక్కువగా ఫలించే కొరకు దాని
శుభ్రము చేసును. నేను మీతో పలికిన మాటవల్ల ౩
మీరు యిప్పుడు శుచులైయున్నారు. నాయందు ౪
మీరున్ను మీయందు నేనున్ను నిలువవలెను.
ద్రాక్షావల్లియందు నిలిచితేనేగాని తీగె దానంతట
అదే యేలాగు ఫలమివ్వదో ఆలాగే నాయందు
నిలిచియుంటేనే గాని మీరున్ను (ఫలించరు.)
ద్రాక్షావల్లిని నేను—తీగెలు మీరు యెవడైనా నా ౫
యందున్న నేను వానియందున్ను నిలిచియుంటే
వాడు బహుగా ఫలించును యెందుకంటే నాకు
వేరై మీరు యేమిన్ని చేయలేరు.
నాయందు యెవడైనా నిలువకుంటే వాడు తీగె ౬
వలె బయిట పారవేయబడి యెండిపోవును. మ
నుష్యులు వాటిని కూర్చి అగ్నిలో వేతురు అప్పుడు
అవి కాల్చబడును. మీరు నా యందు నిలిచి ౭
నా మాటలు మీ యందు నిలిచితే మీరు దేని
కోరుదురో దాని అడుగుదురు అప్పుడు అది మీకు
కలుగును. ఇందువల్ల మీరు బహుగా ఫలించి ౮
నా శిష్యులయే కొరకు నా తండ్రి మహిమపరచ
బడును.§ తండ్రి నన్ను యేలాగు ప్రేమించెనో ౯
నేనున్ను మిమ్మును ఆలాగు ప్రేమించితిని. నా
ప్రేమయందు నిలువండి. నేను నా తండ్రి ఆజ్ఞ ౧౦
లు గైకొని ఆయన ప్రేమయందు నిలిచిన ప్రకా
రము మీరు నా యాజ్ఞలు గైకొనినట్టయితే నా
ప్రేమయందు నిలుతురు. మీ యందు నా సం ౧౧
తోషము నిలుచుటకున్ను మీ సంతోషము పరి
పూర్ణమవుటకున్ను వీటిని మీతో పలికియున్నా
ను. నేను మిమ్మును ప్రేమించిన ప్రకారము ౧౨
మీరు యొకనియందు యొకడు ప్రేమించ వలెనదేది

* లేక, ఆదరణ కర్త. † లేక, క్షేమము. ‡ లేక—అయినప్పటికిన్ని నేను తండ్రిని ప్రేమిస్తున్నాన నిన్ని తండ్రి యేలాగు నాకు ఆజ్ఞాపించెనో ఆలాగే నేను చేస్తున్నానన్ని లోకము తెలుసుకొనే కొరకు—లేవండి యిక్కడనుంచి వెళ్లుదాము. § లేక, మీరు బహుగా ఫలించుటవల్ల నా తండ్రి మహిమపరచబడును మీరు ఆలాగు నా శిష్యులవుదురు.

౧౩ నా యాజ్ఞయై యున్నది. ఒకడు తన స్నేహితుల
కొరకు తన ప్రాణము పెట్టుటకంటే యెక్కువైన
౧౪ ప్రేమగలవాడు యెవడున్ను లేడు. నేను మీకు
ఆజ్ఞాపించినవన్నీ చేసినట్టయితే మీరు నా స్నేహి
౧౫ తులై యున్నారు. దాసుడు తన యజమానుడు
చేసే దాని యెరుగడు గనుక యికమీదట మిమ్ము
ను దాసులని చెప్పను అయితే మిమ్మును స్నేహితు
లని చెప్పితిని యెందుకంటే నేను నా తండ్రివల్ల
౧౬ వినినవన్నీ మీకు తెలియచేసి యున్నాను. మీరు
నన్ను యేర్పరుచుకొనలేదు అయితే మీరు వెళ్లి
ఫలించే కొరకున్ను మీ ఫలము నిలిచేకొరకున్ను
మీరు నా పేరట తండ్రిని యేమి అడుగుదురో
అది ఆయన మీకు యిచ్చేకొరకున్ను మిమ్మును యే
ర్పరుచుకొని మిమ్మును నియమించి యున్నాను.
౧౭ మీరు ఒకనియందు ఒకడు ప్రేమించే కొరకు
వీటిని మీకు ఆజ్ఞాపిస్తున్నాను.
౧౮ లోకము మిమ్మును ద్వేషించినట్టయితే మీకంటే
౧౯ ముందు నన్ను ద్వేషించెనని యెరుగుదురు. మీరు
లోక సంబంధులైతే లోకము తన దాని స్నేహిం
చును అయితే మీరు లోక సంబంధులు కాకుండా
నేను మిమ్మును లోకములోనుంచి యేర్పరుచుకొం
టిని గనుక యిందువల్ల లోకము మిమ్మును ద్వేషి
౨౦ స్తున్నది. నేను మీతో చెప్పినమాటను జ్ఞాపకము
చేసుకొనండి—దాసుడు తన ప్రభువు కంటే అధి
కుడు కాడు. నన్ను తరిమి యుంటే మిమ్మునున్ను
తరుముదురు వారు నా మాట గైకొని యుంటే
౨౧ మీదిన్ని గైకొందురు. అయితే వారు నన్ను పం
పిన వాని యెరుగరు గనుక నా నామము కొరకు
౨౨ వీటినన్నిటినిన్ని మీకు చేయుదురు. నేను వచ్చి
వారితో మాట్లాడకుంటే వారికి పాపము కలుగదు.
అయితే యిప్పుడు తమ పాపము కొరకు వారికి
౨౩ మిష లేదు. నన్ను ద్వేషించే వాడు నా తండ్రి
౨౪ నిన్ని ద్వేషించును. మరిన్ని యెవడున్ను చేయని
కార్యములను నేను వారి మధ్యను చేయకుంటే
వారికి పాపము కలుగదు అయితే యిప్పుడు నన్ను
న్ను నా తండ్రినిన్ని చూచి ద్వేషించి యున్నారు.
౨౫ అయితే—నన్ను వూరకే ద్వేషించిరని వారి ఆజ్ఞా
ప్రమాణములో వ్రాయబడిన వాక్యము నెరవేర్చ
బడే కొరకు (యీలాగు కలుగును.)
౨౬ అయితే నేను మీ యొద్దికి తండ్రి యొద్దనుంచి
పంపే సహాయకుడు అనగా తండ్రి యొద్దనుంచి
బయిలుదేరే సత్యపు ఆత్మ వచ్చేటప్పుడు ఆయన
నన్ను గురించి సాక్ష్యమిచ్చును మీరున్ను మొదట ౨౭
నుంచి నా యొద్ద వున్నందున సాక్ష్యమిత్తురు.

## ౧౬ పర్వము.

మీరు ఆతంకపరచబడక వుండే కొరకు వీటిని ౧
మీతో పలికి యున్నాను. వారు మిమ్మును సున ౨
గోగులలోనుంచి వెలివేతురు. మరిన్ని మిమ్మును
చంపే ప్రతివాడున్ను దేవునికి ఆరాధన * చేసి
నట్టు తలంచుకొనే కాలము వస్తున్నది. వారు ౩
తండ్రినిన్ని నన్నున్ను తెలుసుకొన లేదు గనుక
వీటిని చేతురు. అయితే ఆ కాలము వచ్చినప్పుడు ౪
నేను వీటిని మీతో చెప్పితినని మీరు జ్ఞాపకము
చేసుకొనే కొరకు వీటిని మీతో పలికి యున్నా
ను. మొదట వీటిని మీతో చెప్ప లేదు యెందు
కంటే మీ యొద్ద వుంటిని. అయితే యిప్పుడు ౫
నన్ను పంపిన వాని యొద్దికి వెళ్లుతున్నాను యెక్క
డికి వెళ్లుతున్నావని మీలో యెవడున్ను నన్ను
అడుగలేదు. అయితే నేను వీటిని మీతో చెప్పి ౬
నందున మీ హృదయము దుఃఖముతో నిండి యు
న్నది. అయినప్పటికిన్ని నేను మీతో నిజము ౭
చెప్పుతున్నాను నేను వెళ్లుట మీకు వుపయోగమై
యున్నది యెందుకంటే నేను (మీ యొద్దనుంచి)
వెళ్లకుంటే ఆ సహాయకుడు మీ యొద్దికి రాడు
అయితే నేను వెళ్లినట్టయితే ఆయనను మీ యొద్దికి
పంపుదును. అప్పుడు ఆయన వచ్చి పాపమును ౮
గురించిన్ని నీతిని గురించిన్ని న్యాయపు తీర్పును
గురించిన్ని లోకము ఒప్పుకొన చేసును. నా ౯
యందు విశ్వాసముంచ లేదు గనుక † పాపమును ౧౦
గురించిన్ని నేను నా తండ్రి యొద్దికి వెళ్లి మీకు
యికమీదట అగుపడను గనక † నీతిని గురించిన్ని ౧౧
యీ లోకాధిపతి న్యాయపు తీర్పు పొందెను
గనుక † న్యాయపు తీర్పును గురించిన్ని (ఒప్పు
కొన చేసును.)

మీతో చెప్పుటకు యింకా అనేకమైనవి నాకు ౧౨
కలవు అయితే మీరు వాటిని యిప్పుడు సహించ
లేరు. అయితే ఆయన అనగా సత్యపు ఆత్మ వచ్చి ౧౩
యున్నప్పుడు ఆయన యీ సత్యమంతటికిన్ని మి
మ్మును నడిపించును యెందుకంటే తనకు తానే
యేమిన్ని చెప్పక వేటిని వినునో వాటిని చెప్పి
రాబోయే వాటిని మీకు తెలియచేసును. ఆయన ౧౪
నా వాటిని పొంది మీకు తెలియ చేసుటవల్ల నన్ను
మహిమ పరుచును. తండ్రికి కలిగిన వన్నిన్ని ౧౫
నావి. అందుచేతను ఆయన నా వాటిని పొంది

* లేక—సేవ. † లేక—అని.

౧౬ మీకు తెలియచేసునని చెప్పితిని. నేను తండ్రి
యొద్దికి వెళ్లుతున్నాను గనుక కొంత కాలము మీరు
నన్ను చూడరు తిరిగీ కొంత కాలమునకు నన్ను
చూతురని పలికెను.
౧౭ కాబట్టి ఆయన శిష్యులలో కొందరు—కొంత
కాలము నన్ను చూడరు తిరిగీ కొంత కాలమునకు
నన్ను చూతురు మరిన్ని—నేను తండ్రి యొద్దికి
వెళ్లుతున్నాను గనుక—అని ఆయన మనతో చెప్పి
నది యేమిటి అని వొకనితో వొకడు చెప్పుకొనిరి.
౧౮ కాబట్టి—కొంత కాలము అని ఆయన చెప్పు
తున్నది యేమిటి. ఆయన చెప్పుతున్నది మాకు
౧౯ తెలియదని చెప్పుకొనిరి. కాబట్టి తన్ను అడుగు
టకు వారు కోరుతూ వున్నారని యేసు యెరిగి వారి
తో చెప్పినదేమంటే—కొంతకాలము మీరు నన్ను
చూడరు తిరిగీ కొంత కాలమునకు నన్ను చూతురు
అని నేను చెప్పిన మాటను గురించి మీరు వొకని
౨౦ తో వొకడు విచారణ చేస్తున్నారా. నిజమే
నిజమే నేను మీతో చెప్పేదేమంటే మీరు యేడ్చి
దుఃఖింతురు అయితే లోకము సంతోషించును
మీరు దుఃఖింతురు అయితే మీ దుఃఖము సంతో
౨౧ షమవును. స్త్రీ ప్రసవించేటప్పుడు ఆమె గడి
య వచ్చెను గనుక ఆమెకు దుఃఖము కలుగును
అయితే శిశువు పుట్టగానే లోకమందు నరుడు
పుట్టెననే సంతోషముచేత ఆ వేదన మరి జ్ఞాపకము
౨౨ చేసుకొనదు. అటువలె మీరున్ను యిప్పుడు దుః
ఖముగలవారు అయితే మిమ్మును తిరిగీ చూతును
అప్పుడు మీ హృదయము సంతోషించును మీ
సంతోషమును యెవడున్ను మీ యొద్దనుంచి తీసి
౨౩ వేయడు. ఆ దినమున మీరు దేని గురించిన్ని
నన్ను అడుగరు. నిజమే నిజమే నేను మీతో
చెప్పేది యేమంటే మీరు తండ్రిని నా పేరట
వేటిని అడుగుదురో వాటిని మీకు యిచ్చును.
౨౪ ఇదివరకు మీరు యేమిన్ని నా పేరట అడుగలేదు
మీ సంతోషము పరిపూర్ణమయే కొరకు అడు
గండి మీరు పొందుదురు.
౨౫ వీటిని వుపమానములవల్ల మీతో చెప్పి యు
న్నాను. అయితే నేను యికను యెన్నడున్ను
వుపమానములవల్ల మీతో యేమిన్ని చెప్పక తం
డ్రినిగురించి మీకు స్పష్టముగా తెలియ చెప్పుదు
౨౬ ను. ఆ దినమందు మీరు నా పేరట అడుగు
దురు మీ నిమిత్తము నేను తండ్రిని అడుగుదునని
మీతో చెప్పుతున్నాను కాను యెందుకంటే మీరు ౨౭
నన్ను ప్రేమించి నేను దేవుని యొద్దనుంచి బయి
లుదేరి వచ్చితినని నమ్మితిరి గనుక తండ్రి తానే
మిమ్మును స్నేహిస్తున్నాడు. తండ్రి యొద్దనుంచి ౨౮
బయిలుదేరి లోకమునకు వచ్చి యున్నాను. తిరిగీ
లోకమును విడిచి తండ్రియొద్దికి వెళ్లుతున్నానని
వారితో పలికెను.
ఆయన శిష్యులు—ఇదుగో నీవు యిప్పుడు వుప ౨౯
మానము యే మాత్రమున్ను చెప్పక స్పష్టముగా
పలుకుతున్నావు. సమస్తమున్ను యెరిగిన వాడవ ౩౦
నిన్ని యెవడున్ను నిన్ను అడుగుట నీకు అక్కర
లేదనిన్ని యిప్పుడు యెరుగుదుము. దేవునియొద్ద
నుంచి బయిలుదేరి వచ్చితివని దీనివల్ల నమ్ముతున్నా
మని ఆయనతో చెప్పిరి. అందుకు యేసు—మీరు ౩౧
యిప్పుడు నమ్ముతున్నారు* యిదుగో మీలో ప్రతి
వాడున్ను తన తన వాటికి చెదిరి నన్ను వొంటిగా ౩౨
విడిచే గడియ వస్తున్నది యిప్పుడు వచ్చే యున్నది.
అయితే తండ్రి నాతో వున్నాడు గనుక నేను
వొంటిగా వుండను. మీకు నా యందు సమాధా ౩౩
నము కలిగే నిమిత్తము వీటిని మీతో పలికియు
న్నాను లోకములో మీకు శ్రమ కలుగును అయితే
నేమి ధైర్యము తెచ్చుకొనండి నేను లోకమును
జయించి యున్నానని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.

## ౧౭ పర్వము.

యేసు వీటిని చెప్పి ఆకాశము తట్టు తన కన్ను ౧
లెత్తి చెప్పినదేమంటే—తండ్రీ ఆ గడియ వచ్చెను.
నీ కుమారునికి నీవు యిచ్చిన వారందరికిన్ని ఆయన ౨
నిత్యజీవము యిచ్చే నిమిత్తము సర్వ మాంసము మీ
దనున్ను ఆయనకు నీవు అధికారమును యిచ్చిన
ప్రకారము నీ కుమారుడు నిన్ను మహిమపరిచే
కొరకు నీ కుమారుని నీవు మహిమపరుచుము. అ ౩
ద్వితీయమైన నిజదేవుడవైన నిన్నున్ను నీవు పంపిన
యేసు క్రీస్తునున్ను యెరుగుట నిత్య జీవమై యు
న్నది. నేను భూమి మీద నిన్ను మహిమపరిచి ౪
తిని. నేను చేయుటకు నీవు నాకు యిచ్చిన కా ౫
ర్యము నెరవేర్చి యున్నాను గనుక ఓ తండ్రీ
లోకము కాక మునుపు నీ యొద్ద నాకు కలిగిన
మహిమతో యిప్పుడు నీ యొద్ద నన్ను మహిమప
రుచుము. లోకములోనుంచి నీవు నాకు యిచ్చిన ౬
మనుష్యులకు నీ నామమును అగుపరిచి యున్నా
ను. వారు నీ వారై యుండిరి నీవు నాకు వారిని
యిచ్చి యున్నావు. వారు నీ వాక్యము గైకొని

* లేక, నమ్ముతున్నారా.

౭ యున్నారు. నీవు నాకు యిచ్చినవన్నిన్ని నీవల్ల
౮ వున్నవని యిప్పుడు యెరిగి యున్నారు. యెందు
కంటే నీవు నాకు యిచ్చిన మాటలు వారికి యిచ్చి
యున్నాను. వారు వాటిని అంగీకరించి నేను నీ
యొద్దనుంచి బయిలుదేరి వచ్చితినని నిశ్చయముగా
యెరిగి నీవు నన్ను పంపితివని నమ్మి యున్నారు.
౯ నేను వారి కొరకు ప్రార్థిస్తున్నాను. నీవారై
నందున నీవు నాకు యిచ్చినవారి కొరకు ప్రార్థిస్తు
౧౦ న్నాను గాని లోకము కొరకు కాదు. మరిన్ని
నావన్నిన్ని నీవై యున్నవి నీవిన్ని నావి. వారి
౧౧ యందు మహిమపరచబడి యున్నాను. ఇకను
యీ లోకములో వుండను అయితే వీరు యీ లోక
ములో వున్నారు నేను నీ యొద్దికి వస్తున్నాను.
పరిశుద్ధుడవైన తండ్రీ మన వలె వారు యేకమై
యుండుటకు నీవు నాకు యిచ్చిన వారిని నీ నామ
౧౨ మందు కాపాడుము. నేను యీ లోకములో
వారి యొద్ద వున్నప్పుడు వారిని నీ నామమందు
కాపాడితిని. నీవు నాకు యిచ్చిన వారిని కాపా
డితిని. లేఖనము నెరవేరే కొరకు నాశపు కుమా
రుడే గాని వారిలో యెవడున్ను నశించ లేదు.
౧౩ అయితే యిప్పుడు నీ యొద్దికి వస్తున్నాను వారికి
నా సంతోషము వారిలో పరిపూర్ణము చేయ
బడే కొరకు వీటిని యీ లోకమందు పలుకుతు
౧౪ న్నాను. వారికి నీ వాక్యము యిచ్చి యున్నాను
నేను యీ లోకపు వాడను కాని ప్రకారముగా
వారున్ను యీ లోకపు వారు కారు గనుక యీ
౧౫ లోకము వారిని ద్వేషించెను. నీవు వారిని దౌష్ట్య
మునుంచి * కాపాడుటకే గాని వారిని లోకము
నుంచి కొంచుపోవుటకు నేను అడుగుతున్నాను
౧౬ కాను. నేను యీ లోకపు వాడను కాని ప్రకా
రముగా వారున్ను యీ లోకపు వారు కారు.
౧౭ వారిని నీ సత్యము వల్ల † పరిశుద్ధపరుచుము నీ
౧౮ వాక్యము సత్యము. నీవు నన్ను యీ లోకము
లోకి పంపిన ప్రకారము నేనున్ను వారిని యీ
౧౯ లోకమునకు పంపి యున్నాను. వారున్ను సత్య
మువల్ల† పరిశుద్ధపరచబడే కొరకు వారి నిమిత్తము
నన్ను పరిశుద్ధపరుచుకొంటున్నాను.
౨౦ మరిన్ని నీవు నన్ను పంపితివని యీ లోకము
నమ్ముటకు ఓ తండ్రీ నా యందు నీవున్ను నీ యందు
౨౧ నేనున్ను వున్న ప్రకారము వారున్ను మన యందు
యేకమై యుండే నిమిత్తము వారి కొరకు మాత్రమే
కాకుండా అందరున్ను యేకమైయుండే నిమిత్తము
వారి వాక్యమువల్ల నా యందు విశ్వాసముంచే
వారి కొరకున్ను వేడుకొంటున్నాను యెందుకంటే ౨౨
మనము యేకమై యున్న ప్రకారము వారున్ను ౨౩
యేకమై యుండే నిమిత్తము—వారియందు నేనున్ను
నా యందు నీవున్ను వుండి వారు యేకమై పరి
పూర్ణము చేయబడుటకున్ను నీవు నన్ను పంపితి
వనిన్ని నన్ను ప్రేమించిన ప్రకారము వారిని
ప్రేమించితివనిన్ని యీ లోకము తెలుసుకొనుట
కున్ను నీవు నాకు యిచ్చిన మహిమ నేను వారికి
యిచ్చి యున్నాను.

జగత్తు పునాది వేయబడక మునుపు నీవు నన్ను ౨౪
ప్రేమించితివి గనుక ఓ తండ్రీ నేను యెక్కడ
వుందునో అక్కడ నీవు నాకు యిచ్చిన వారున్ను
నాతో వుండి నీవు నాకు యిచ్చిన మహిమ చూచు
టకు కోరుతున్నాను. న్యాయముగల తండ్రీ లో ౨౫
కము నిన్ను యెరుగదు అయితే నేను నిన్ను యె
రుగుదును మరిన్ని నీవు నన్ను పంపితివని వీరు యె
రిగి యున్నారు. నీవు నా యందు వుంచిన ౨౬
ప్రేమ వారియందున్ను నేను వారియందున్ను వుం
డేకొరకు నేను వారికి నీ నామము తెలియచేసితిని
యింకా తెలియ చేతునని పలికెను.

## ౧౮ పర్వము.

యేసు వీటిని చెప్పి తన శిష్యులతో కెద్రో ౧
ననే యేటి అవతలకు బయిలు వెళ్లెను. అక్కడ
వున్న తోటలో ఆయనయున్ను ఆయన శిష్యులు
న్ను ప్రవేశించిరి. యేసు తన శిష్యులతో అనేక ౨
పర్యాయములు అక్కడికి వెళ్లుతూ వుండేవాడు
గనుక ఆయనను అప్పగించిన యూదాకున్ను ఆ
స్థలము తెలిసెను. కాబట్టి ఆ యూదా కొందరు ౩
రాణువవారినిన్ని ప్రధాన యాజకుల వల్లనున్ను
పరిసైయుల వల్లనున్ను బంట్రౌతులనున్ను పుచ్చు
కొని దీపములతోనున్ను దివిటీలతోనున్ను ఆయు
ధములతోనున్ను అక్కడికి వచ్చెను.

కాబట్టి యేసు తన మీదికి వస్తూ వున్నవన్నిన్ని ౪
యెరిగి బయిలువెళ్లి—మీరు యెవని వెతుకుతున్నా
రని వారితో చెప్పెను. వారు—నజరేథువాడైన ౫
యేసునని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చిరి. యేసు—
నేనే ఆయననని వారితో చెప్పెను. ఆయనను
అప్పగించిన యూదా కూడా వారితో నిలుస్తూ

* లేక, దుష్టుని నుంచి. † లేక, విషయమై.

౬ వుండెను. కాబట్టి ఆయన నేనే ఆయననని వారి
తో చెప్పగానే వారు వెనుకకు వెళ్లి నేల మీద
౭ పడిరి గనుక ఆయన—మీరు యెవని వెతుకు
తున్నారని తిరిగీ వారిని అడిగెను అందుకు వారు—
నజరేతు వాడైన యేసును అని చెప్పినప్పుడు—
౮ నీవు నాకు యిచ్చినవారిలో వొకనినైనా నేను పో
౯ గొట్టుకొనలేదని ఆయన చెప్పిన మాట నెరవేర్చబడే
కొరకు యేసు—నేనే ఆయననని మీతో చెప్పితిని
గనుక మీరు నన్ను వెతికినట్టయితే వీరిని వెళ్లని
వ్వండి అని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.
౧౦ కాబట్టి సీమోను పేతురుయొద్ద కత్తి వుండెను
గనుక ఆయన దాని దూసి ప్రధాన యాజకుని
౧౧ దాసుని కొట్టి అతని కుడి చెవి తెగకోసెను. ఆ
దాసుని పేరు మల్ఖు. అప్పుడు యేసు—నీ కత్తి
వరలో వేయుము తండ్రి నాకు యిచ్చిన గిన్నెతో
నేను తాగనా అని పేతురుతో చెప్పెను.
౧౨ కాబట్టి రాణువవారున్ను సహస్రాధిపతియు
న్ను యూదుల బంట్రౌతులున్ను యేసును పట్టు
కొని ఆయనను కట్టి మొదట అన్నాయొద్దికి ఆయ
౧౩ నను తీసుకొని వెళ్లిరి యెందుకంటే అతడు ఆ
సంవత్సరము ప్రధాన యాజకుడైన కయఫకు మా
౧౪ మయ్యె యుండెను. కయఫ—వొక మనుష్యుడు
ప్రజల కొరకు చనిపోవుట వుపయోగమని యూ
దులకు ఆలోచన చెప్పినవాడై యుండెను.
౧౫ మరిన్ని సీమోను పేతురున్ను మరియొక శిష్యు
డున్ను యేసును వెంబడించిరి. ఆ శిష్యుడు
ప్రధానయాజకునికి నెళవైనవాడు గనుక ప్రధాన
యాజకుని దివాణములోకి యేసుతో కూడా వెళ్లె
౧౬ ను. అయితే పేతురు ద్వారముయొద్ద బయిట
నిలిచెను గనుక ప్రధానయాజకునికి నెళవైన ఆ
వేరొక శిష్యుడు బయిలువెళ్లి ద్వారపాలకురాలి
తో మాట్లాడి పేతురును లోపటికి తీసుకొని
౧౭ వచ్చెను. కాబట్టి ద్వారపాలకురాలైన చిన్నది—
నీవున్ను యీ మనుష్యుని శిష్యులలో వొకడవా
అని పేతురుతో చెప్పినప్పుడు ఆయన కానని పలి
౧౮ కెను. మరిన్ని చలి వేసినందున దాసులున్ను బం
ట్రౌతులున్ను మంట వేసి కాచుకొంటూ వున్న
ప్పుడు పేతురు వారితో నిలిచి కాచుకొంటూ
వుండెను.
౧౯ కాబట్టి ప్రధానయాజకుడు ఆయన శిష్యులను
గురించిన్ని ఆయన బోధను గురించిన్ని యేసును
౨౦ అడిగినప్పుడు యేసు—నేను బహిరంగముగా లోక
ముతో పలికితిని. యూదులందరు కూడి వచ్చే
గుడిలోనున్ను సునగోగులలోనున్ను యెల్లప్పుడు
న్ను బోధించితిని రహస్యముగా నేను యేమిన్ని
పలుకలేదు. నన్ను మీరు అడుగుట యెందుకు ౨౧
నేను వారితో పలికినది విన్న వారిని అడుగండి
యిదుగో నేను పలికినవి వీరికి తెలుసునని ఆయ
నకు ప్రత్యుత్తరమిచ్చెను. ఆయన వీటిని చెప్పిన ౨౨
ప్పుడు దగ్గిర నిలిచిన పరిచారకులలో వొకడు—
ప్రధానయాజకునికి యీలాగు ప్రత్యుత్తరమిస్తు
న్నావా అని యేసును చేతితో చరిచెను. అం ౨౩
దుకు యేసు—నేను కాని మాట పలికి యుంటే
ఆ చెడుతనమును గురించి నీవు సాక్ష్యము చెప్పుము
మంచిదైతే నన్ను యెందుకు కొట్టుతున్నావని అత
నికి ప్రత్యుత్తరమిచ్చెను.
కట్టబడిన ఆయనను అన్నా ప్రధాన యాజకు ౨౪
డైన కయఫ యొద్దికి పంపెను. అప్పుడు సీమోను ౨౫
పేతురు నిలిచి కాచుకొంటూ వుండెను గనుక
వారు—నీవున్ను ఆయన శిష్యులలో వొకడవా అని
ఆయనతో చెప్పిరి. ఆయన—నేను కానని పలి
కెను. పేతురు యెవని చెవి కోసెనో వాని ౨౬
బంధువున్ను ప్రధాన యాజకుని దాసులలో వొక
డున్నైన వాడు—నీవు తోటలో ఆయన యొద్ద
వుండుట నేను చూడ లేదా అని చెప్పెను గనుక ౨౭
పేతురు తిరిగీ—అలాగు కాదనెను. వెంటనే కోడి
కూసెను.
కాబట్టి వారు యేసును కయఫ యొద్దనుంచి ౨౮
అధికారి యింటికి తీసుకొని వెళ్లిరి. అప్పుడు వుద
యమైనది. అయితే వారు పస్కాను భుజించుటకు
మైల తగులునేమో అని అధికారి యింట ప్రవే
శించ లేదు. కాబట్టి పిలాతు వారి యొద్దికి బయి ౨౯
లువెళ్లి—ఈ మనుష్యునికి విరోధముగా మీరు యే
ఫిర్యాదు చేస్తున్నారనెను. అందుకు వారు— ౩౦
ఇతడు దుర్మార్గుడు కాకపోతే యితని నీకు అప్ప
గించక వుందుమని ఆయనతో చెప్పి ప్రత్యుత్తర
మిచ్చిరి. కాబట్టి పిలాతు—మీరు అతని పట్టు ౩౧
కొని మీ ఆజ్ఞా ప్రమాణము చొప్పున అతనికి
తీర్పు చేయండని చెప్పెను. కాబట్టి యేసు ౩౨
తాను యెటువంటి మరణము పొంద వలెనో దాని
సూచించి చెప్పిన మాట నెరవేరే కొరకు యూదు
లు—యెవనిన్ని చంపించుటకు మాకు అధికారము
లేదని ఆయనతో చెప్పిరి. కాబట్టి పిలాతు తిరిగీ ౩౩
అధికారి మందిరములోకి * వెళ్లి యేసును పిలి

* గ్రీకులో, ప్రేతోర్యము.

పించి—నీవు యూదుల రాజువై యున్నావా అని
౩౪ ఆయనతో పలికెను. అందుకు యేసు—నీ యం
తట నీవే దీని చెప్పుతున్నావా లేక యితరులు
నీతో నన్ను గురించి చెప్పిరా అని ఆయనకు
౩౫ ప్రత్యుత్తర మిచ్చెను. అందుకు పిలాతు—నేను
యూదుడనా నీ దేశస్థులున్ను ప్రధాన యాజకు
లున్ను నిన్ను నాకు అప్పగించిరి యేమి చేసితివని
౩౬ ప్రత్యుత్తరమిచ్చెను. యేసు—నా రాజ్యము యీ
లోక సంబంధమైనది కాదు నా రాజ్యము యీ
లోక సంబంధమైనదైతే నేను యూదులకు అప్ప
గించబడక వుండే నిమిత్తము నా బంట్రౌతులు నా
కొరకు పోరాడుదురు అయితే యిప్పుడు నా రా
జ్యము యిక్కడిది కాదని ప్రత్యుత్తరమిచ్చెను.
౩౭ అందుకు పిలాతు—అలాగైతే నీవు రాజువా అని
పలికెను. యేసు—నేను రాజునై యున్నానని
నీవు చెప్పుతున్నావు నేను సత్యమును గురించి
సాక్ష్యమిచ్చుటకు నేను దీని నిమిత్తము పుట్టి దీని
నిమిత్తము యీ లోకమునకు వచ్చితిని. సత్యసంబం
ధియైన ప్రతివాడున్ను నా శబ్దము వినునని ప్రత్యు
౩౮ త్తరమిచ్చెను. పిలాతు—సత్యము అంటే యేమిటి
అని ఆయనతో చెప్పెను. దీని పలుకుతూ తిరిగీ
యూదుల యొద్దికి బైలువెళ్లి—నేను ఆయన యందు
౩౯ యే దోషమున్ను కనుగొన లేదు. అయితే పస్కా
(పండుగ) లో మీ కొరకు నేను వొకని విడిపించ
వలెననే యొక మర్యాద మీకు కలిగి యున్నది
గనుక నేను యూదుల రాజును మీ కొరకు విడి
పించుట మీకు యిష్టమవునా అని వారితో పలికి
౪౦ నందున వారందరున్ను—వీని కాదు బరబ్బాను
అని తిరిగీ కేకలు వేసిరి. ఈ బరబ్బా దొంగయై
యుండెను.

## ౧౯ పర్వము.

కాబట్టి పిలాతు అప్పుడు యేసును పట్టుకొని
౨ ఆయనను కొరడాలతో కొట్టించెను. రాణువవారు
ముండ్లతో కిరీటమునల్లి ఆయన తల మీద పెట్టి
౩ ధూమ్ర వస్త్రము ఆయన చుట్టూ వేసి—యూ
దుల రాజా నీకు శుభమని చెప్పి ఆయనను చేతితో
చరుస్తూ వుండిరి.
౪ కాబట్టి పిలాతు తిరిగీ వెలపటికి బైలువెళ్లి—
ఇదుగో యీయన యందు దోషమేమిన్ని నాకు
అగుపడ లేదని మీరు యెరిగేటట్టు మీ కొరకు
యీయనను వెలపటికి తీసుకొని వస్తున్నానని వారి
తో పలికెను. కాబట్టి ఆ ముండ్ల కిరీటమున్ను ౫
ధూమ్ర వస్త్రమున్ను ధరించిన యేసు వెలపటికి
వచ్చినప్పుడు (పిలాతు)—ఇదుగో యీ మనుష్యు
డని వారితో చెప్పెను. కాబట్టి ప్రధాన యాజ ౬
కులున్ను పరిచారకులున్ను ఆయనను చూచినప్పుడు
వారు—అతని శిలువవేయుము శిలువవేయుము అని
కేకలు వేసిరి. పిలాతు—ఆయన యందు నేను
యే దోషమున్ను కనుగొనలేదు గనుక మీరే ఆయ
నను పట్టుకొని శిలువవేయండని చెప్పెను. అం ౭
దుకు యూదులు—మాకు ఆజ్ఞాప్రమాణము వున్నది.
ఇతడు తన్ను దేవుని కుమారునిగా చేసుకొనెను
గనుక మా ఆజ్ఞాప్రమాణము చొప్పున యితడు
చావవలెనని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చిరి.

కాబట్టి పిలాతు ఆ మాట విని మరీ యెక్కువ ౮
భయపడి తిరిగీ అధిపతి మందిరములో* ప్రవేశిం
చి—నీవు యెక్కడనుంచి వచ్చితివని యేసుతో ౯
పలికెను. అయితే యేసు ఆయనకు ప్రత్యుత్తర
మివ్వలేదు గనుక పిలాతు—నాతో పలుకవా ౧౦
నిన్ను శిలువవేయుటకు నాకు అధికారము† కల
దనిన్ని నిన్ను విడిపించుటకు నాకు అధికారము†
కలదనిన్ని నీవు యెరుగవా అని ఆయనతో చెప్పె
ను. అందుకు యేసు—పైనుంచి నీకు యివ్వబడక ౧౧
పోతే నాకు విరోధముగా నీకు యే అధికారము
న్ను† కలుగదు అందుచేతను నన్ను నీకు అప్పగిం
చినవానికి యెక్కువ పాపము కలదని ప్రత్యుత్తర
మిచ్చెను.

అప్పటినుంచి పిలాతు ఆయనను విడిపించుటకు ౧౨
యత్నపడెను అయితే యూదులు—నీవు వీని విడి
పించినట్టయితే కైసరు స్నేహితుడవు కావు తన్ను
రాజును చేసుకొనే ప్రతివాడున్ను కైసరుకు విరో
ధముగా మాట్లాడుతున్నాడని కేకలు వేసిరి. కా ౧౩
బట్టి పిలాతు యీ మాట విని యేసును బయిటికి
తీసుకొని వచ్చి హెబ్రాయి భాషలో గబ్బథా
అనబడిన చిత్రవర్ణ శిలాస్థలమందు న్యాయపీఠము
మీద కూర్చుండెను. అది పస్కాను సిద్ధపరిచే ౧౪
దినము. అప్పుడు కొంచెము తక్కువ ఆరు గం
టలు‡ కావచ్చును ఆయన—ఇదుగో మీ రాజు
అని యూదులతో చెప్పెను అయితే వారు—వీని ౧౫
కొనిపొమ్ము కొనిపొమ్ము శిలువ వేయుమని కేకలు
వేసిరి. పిలాతు—మీ రాజును శిలువవేయనా
అని వారితో పలికెను. అందుకు ప్రధాన యాజ

* గ్రేకులో, ప్రేతోర్యము. † లేక, శక్తి. ‡ అనగా మధ్యాహ్నము.

కులు—కైసరుగాక మాకు వేరే రాజు లేడని ప్ర
౧౬ త్యుత్తరమిచ్చిరి. కాబట్టి శిలువ వేయబడుటకు
౧౭ ఆయనను వారికి అప్పగించెను. వారు యేసును
పట్టి తీసుకొని వెళ్లిరి. ఆయన తన శిలువ మో
సుకొని హెబ్రాయి భాషలో గొల్గొథా అనబడిన
కపాలస్థలమనే పేరుగల చోటుకు బయిలువెళ్లెను.
౧౮ అక్కడ ఆ తట్టు వొకడున్ను యీ తట్టు వొకడు
న్ను మధ్యను యేసున్ను వుండేలాగున ఆయననున్ను
మరి యిద్దరినిన్ని శిలువవేసిరి.
౧౯ మరిన్ని పిలాతు పైవిలాసము వ్రాసి శిలువ
మీద వేయించెను. నజోరీయుడైన యేసనే యూ
౨౦ దుల రాజు అని వ్రాయబడెను. యేసు శిలువ
వేయబడిన స్థలము పట్టణమునకు సమీపమై యుం
డెను గనుక యూదులలో అనేకులు యీ పైవిలా
సము చదివిరి. అది హెబ్రాయి హెల్లేని రోమా
౨౧ యి భాషలతో వ్రాయబడెను. కాబట్టి—నేను
యూదుల రాజునని అతడు చెప్పెననేదేగాని—
యూదుల రాజని వ్రాయవద్దని యూదుల ప్రధా
౨౨ నయాజకులు పిలాతుతో చెప్పిరి. అందుకు పిలా
తు—నేను వ్రాసినది వ్రాసే యున్నానని ప్రత్యు
౨౩ త్తరమిచ్చెను. అంతట రాణువవారు యేసును
శిలువవేసిన తరువాత ఆయన వస్త్రములను పట్టు
కొని ప్రతి రాణువవానికిన్ని వొక భాగము వుం
డేటట్టు వాటిని నాలుగు భాగములగా చేసిరి.
ఆయన నిలువుటంగీకూడా (పుచ్చుకొనిరి). అయి
తే ఆ నిలువుటంగీ కుట్టు లేక మీదనుంచి కేవలము
౨౪ నేయబడెను గనుక వారు—దాని చింపక అది
యెవనిదౌనో దాని గూర్చి చీట్లు వేయుదమని
వొకనితో వొకడు చెప్పుకొనిరి. అందువల్ల—
వారు నా వస్త్రములను తమకు తామే పంచుకొని
నా అంగీని గురించి చీట్లువేసిరని చెప్పే లేఖనము
నెరవేర్చబడెను. కాబట్టి రాణువవారు వీటిని
చేసిరి.
౨౫ అప్పుడు ఆయన తల్లిన్ని ఆయన తల్లి సహో
దరిన్ని క్లోపా భార్యయున్నయిన మరియయున్ను
మగ్దలావూరి మరియయున్ను యేసు శిలువయొద్ద
౨౬ నిలిచిరి. కాబట్టి యేసు తన తల్లినిన్ని తాను
ప్రేమించిన శిష్యుడు దగ్గిర నిలుచుటనున్ను చూ
చి—ఓ స్త్రీ యిదుగో నీ కుమారుడు అని ఆమెతో
చెప్పిన తరువాత—ఇదుగో నీ తల్లి అని ఆ శిష్యు
నితో చెప్పెను. ఆ గడియనుంచి ఆ శిష్యుడు ౨౭
ఆమెను తన యింట చేర్చుకొనెను.
ఆ తరువాత లేఖనము నెరవేర్చబడుటకు సమ ౨౮
స్తమున్ను యిప్పుడు సంపూర్తి చేయబడెనని
యేసు యెరిగి—నాకు దాహమయినదని చెప్పెను.
చిరకతో నిండుకొనిన వొక పాత్ర అక్కడ వుంచ ౨౯
బడెను గనుక వారు వొక స్పంజీ చిరకతో నింపి
హిస్సోపు మీద వేసి ఆయన నోటికి అందిచ్చిరి.
అంతట యేసు ఆ చిరక పుచ్చుకొనినప్పుడు— ౩౦
సమాప్తియైనదని చెప్పి తల వంచుకొని తన ఆత్మను
అప్పగించెను.
కాబట్టి అది సిద్ధపరిచే దినము గనుక ఆ దేహ ౩౧
ములు సబ్బాతున శిలువ మీద నిలువక వుండేకొ
రకు యూదులు వాటి కాళ్లు విరిచి వాటిని తీసు
కొని వెళ్లుటకు పిలాతును వేడుకొనిరి యెందుకం
టే ఆ సబ్బాతు దినము గొప్పది. కాబట్టి రాణు ౩౨
వవారు వచ్చి ఆయనతో శిలువవేయబడిన మొదటి
వానియొక్కయున్ను రెండోవానియొక్కయున్ను
కాళ్లు విరిచిరి. అయితే వారు యేసు యొద్దికివచ్చి ౩౩
అంతకు ముందు చనిపోయిన ఆయనను చూచి
ఆయన కాళ్లు విరువలేదు. అయితే రాణువవారి ౩౪
లో వొకడు యీటెతో ఆయన పక్కను పొడి
చెను వెంటనే రక్తమున్ను నీళ్లున్ను బయిటికి వచ్చె
ను. చూచిన వాడు సాక్ష్యమిచ్చి యున్నాడు ౩౫
ఆయన సాక్ష్యము నిజమై యున్నది. మీరున్ను
నమ్మేకొరకు తాను నిజమైనవి చెప్పుతున్నాడని యె
రిగియున్నాడు యెందుకంటే—ఆయన* యెముక ౩౬
వొకటైనా విరువబడదనే లేఖనము నెరవేర్చబడే
కొరకు యివి జరిగెను. మరిన్ని—తాము పొడిచి
నవాని తట్టు చూతురని మరియొక లేఖనము చెప్పు ౩౭
తున్నది.
ఇవియైన తరువాత అరిమథైయ వూరివాడున్ను ౩౮
యూదుల భయమువల్ల రహస్యముగా యేసు శిష్యు
డున్నయిన యోశేపు యేసు దేహమును తీసుకొని
వెళ్లుటకు పిలాతును వేడుకొనెను. పిలాతు సెల
విచ్చినందున ఆయన వచ్చి యేసు దేహమును తీసు
కొని వెళ్లెను. అయితే మొదట రాత్రివేళ యేసు ౩౯
యొద్దికి వచ్చిన నికొదేము కూడా బోళమునున్ను
అగరునున్ను కలిపి కొంచెము యెక్కువతక్కువ
నూటయిరువై శేరులు తీసుకొని వచ్చెను. అం ౪౦
తట వారు యేసు దేహమును పట్టుకొని యూదు
లు పాతి పెట్టే మర్యాద చొప్పున ఆ సుగంధ

* లేక—దాని.

౪౧ ద్రవ్యములు వేసి నారబట్టలు దానికి చుట్టిరి. మ
రిన్ని ఆయన శిలువవేయబడిన స్థలములో వొక
తోట వుండెను ఆ తోటలో వొక కొత్త సమాధి
౪౨ యుండెను. దానిలో యెవడున్ను యెప్పుడైనా
వుంచబడలేదు. కాబట్టి ఆ సమాధి సమీపమై
నది గనుక యూదుల పండుగకు తొలిదినమైనం
దున దానిలో యేసును వుంచిరి.

## ౨౦ పర్వము.

ఆదివారమునాడు యింకా చీకటిగా వున్న
ప్పుడు మగ్దలా వూరి మరియ పెందలాడి ఆ సమాధి
యొద్దికి వచ్చి రాయి సమాధి యొద్దనుంచి తీయబడి
౨ యుండుట చూచెను గనుక ఆమె పరుగెత్తి సీమో
ను పేతురు యొద్దికిన్ని యేసు స్నేహించిన ఆ మరి
యొక శిష్యుని యొద్దికిన్ని వచ్చి—ప్రభువును సమా
ధిలో నుంచి తీసుకొని వెళ్లిరి ఆయనను యెక్కడ
౩ వుంచిరో మాకు తెలియదని చెప్పెను. కాబట్టి
పేతురున్ను ఆ మరియొక శిష్యుడున్ను బయిలు
౪ వెళ్లి సమాధి యొద్దికి వస్తూ వున్నప్పుడు వారిద్ద
రున్ను కూడి పరుగెత్తిరి. అయితే ఆ మరియొక
శిష్యుడు పేతురు కంటే త్వరగా పరుగెత్తి ముం
౫ దుగా సమాధియొద్దికి వచ్చి వంగి పడియున్న నార
బట్టలు చూచెను. అయినప్పటికిన్ని అందులోకి
౬ వెళ్లలేదు. కాబట్టి సీమోను పేతురు అతని వెం
౭ బడి వచ్చి సమాధిలో ప్రవేశించి పడియున్న నార
బట్టలనున్ను నార బట్టల యొద్ద పడియుండక వేరు
గా వొక చోటున చుట్టబడిన ఆయన తలమీద
వున్న రుమాలునున్ను చూచెను. అప్పుడు మొ
౮ దట సమాధి యొద్దికి వచ్చిన ఆ మరియొక శిష్యుడు
౯ కూడా లోపటికి వెళ్లి చూచి నమ్మెను యెందు
కంటే ఆయన మృతులలోనుంచి లేచుట అగత్యా
మని వ్రాయబడిన దాని వారు యింకా గ్రహిం
౧౦ చుకొన లేదు. అంతట ఆ శిష్యులు తిరిగీ తమ
వారి యొద్దికి వెళ్లి పోయిరి.
౧౧ అయితే మరియ సమాధి బయిట నిలిచి యేడు
౧౨ స్తూ వుండెను. అప్పుడు ఆమె యేడుస్తూ వున్న
ప్పుడు తెల్లని వస్త్రములు గల యిద్దరు దూతలు
యేసు దేహము పడిన స్థలములో తల వైపున వొక
డున్ను కాళ్ల వైపున వొకడున్ను కూర్చుండుట
౧౩ సమాధిలోకి ఆమె వంగి చూచెను. వారు—ఓ
స్త్రీ యెందుకు యేడుస్తున్నావని ఆమెతో చెప్పిన
ప్పుడు ఆమె—నా ప్రభువును వారు తీసినారు ఆ
యనను యెక్కడ వుంచిరో అది నాకు తెలియక
వున్నందున అని చెప్పెను. ఆమె వీటిని చెప్పి ౧౪
వెనుకతట్టు తిరిగి యేసు నిలిచి యుండుట చూచి
న్ని ఆయన యేసని తెలియక పోయెను. యేసు- ౧౫
ఓ స్త్రీ యెందుకు యేడుస్తున్నావు యెవని వెతుకు
తున్నావని ఆమెతో పలికినప్పుడు ఆమె ఆయ
నను తోటవాడని తలంచి—అయ్యా నీవు ఆయనను
మోసుకొని వెళ్లి యుంటే ఆయనను యెక్కడ వుం
చితివో నాతో చెప్పుము అప్పుడు నేను ఆయనను
తీసుకొని వెళ్లుదునని చెప్పెను. యేసు—మరియా ౧౬
అని ఆమెతో పలికెను. ఆమె తిరిగి—రబ్బూనీ
అనగా బోధకుడా అని ఆయనతో చెప్పెను.
యేసు—నన్ను ముట్టవద్దు యెందుకంటే నేను యిం ౧౭
కా నా తండ్రి యొద్దికి పైకి వెళ్లలేదు. అయితే
నా సహోదరుల యొద్దికి వెళ్లి—నా తండ్రియు
న్ను మీ తండ్రియున్ను నా దేవుడున్ను మీ దేవు
డున్నయిన వాని యొద్దికి యెక్కి వెళ్లుతున్నానని
వారితో చెప్పుమని ఆమెతో పలికెను. మగ్దల ౧౮
వూరి మరియ వచ్చి తాను ప్రభువును చూచితి
ననిన్ని ఆయన తనతో వీటిని పలికెననిన్ని శిష్యు
లకు తెలియచేసెను.
ఆదివారమైన ఆ దినమందే సాయంకాలమున ౧౯
యూదుల భయమువల్ల శిష్యులు కూడి యున్న
(యింటి) తలుపులు మూయబడినప్పుడు యేసు
వచ్చి మధ్యను నిలిచి—మీకు సమాధానమవునుగాక
అని వారితో చెప్పెను. ఆయన ఆలాగు చెప్పి ౨౦
వారికి తన చేతులనున్ను పక్కనున్ను చూపించెను.
అంతట శిష్యులు ప్రభువును చూచి సంతోషించిరి.
కాబట్టి యేసు తిరిగీ—మీకు సమాధానమవును ౨౧
గాక అనిన్ని తండ్రి నన్ను పంపిన ప్రకారము
నేనున్ను మిమ్మును పంపుతున్నాననిన్ని వారితో
చెప్పెను. అప్పుడు వీటిని చెప్పి వారిమీద వూ ౨౨
పిరి విడిచి—పరిశుద్ధాత్మను పొందండి మీరు యెవరి ౨౩
పాపములను క్షమింతురో వారికి క్షమించ బడును
యెవరి పాపములను మీరు నిలువచేతురో అవి
నిలువ చేయబడునని వారితో చెప్పెను.
అయితే యేసు వచ్చినప్పుడు పన్నెండు మంది ౨౪
లో వొకడైన దిదుము అనబడిన థోమా వారితో
వుండ లేదు గనుక యితర శిష్యులు—మేము ప్రభు ౨౫
వును చూచితిమని అతనితో చెప్పినప్పుడు—అతడు
నేను ఆయన చేతులలో మేకుల గురుతుచూచి నా
వేలు మేకుల గురుతులలో వుంచి నా చెయ్యి ఆ
యన పక్కలో వుంచితేనేగాని నేను నమ్మనని
వారితో చెప్పెను.

౨౬ ఎనిమిది దినములైన తరువాత తిరిగీ ఆయన
శిష్యులు లోపట వుండిరి. అప్పుడు థోమా వారి
తో కూడా వుండెను. తలుపులు మూయబడిన
ప్పుడు యేసువచ్చి మధ్యను నిలిచి—మీకు సమా
౨౭ ధానమవునుగాక అని చెప్పి—నీ వేలు యీలాగు
చాచి నా చేతులు చూడుము నీ చెయ్యి చాచి
నా పక్కలో వుంచి అవిశ్వాసివి కాక విశ్వాసివై
౨౮ యుండుమని థోమాతో చెప్పెను. అందుకు
థోమా—నా ప్రభువా నా దేవుడా అని ప్రత్యు
౨౯ త్తరమిచ్చెను. అప్పుడు యేసు—థోమా నీవు
నన్ను చూచినందున నమ్మితివి చూడకనే నమ్మేవారు
భాగ్యవంతులని అతనితో చెప్పెను.
౩౦ మరిన్ని వేరే అనేకమైన అద్భుతములను యేసు
తన శిష్యుల యెదుట చేసెను. అవి యీ గ్రంథ
౩౧ మందు వ్రాయబడలేదు. అయితే యేసు దేవుని
కుమారుడైన క్రీస్తని మీరు నమ్మేకొరకున్ను నమ్మి
ఆయన నామమువల్ల జీవము పొందేకొరకున్ను
యివి వ్రాయబడి యున్నవి.

## ౨౧ పర్వము.

అటుతరువాత యేసు తిబెరి సముద్రము దగ్గిర
తిరిగీ తన్ను శిష్యులకు అగుపరుచుకొనెను. ఈ
౨ విధముగా ఆయన తన్ను చూడనిచ్చెను. సీమోను
పేతురున్ను దిదుము అనబడిన థోమాయున్ను గలి
లైయలో వున్న కానావూరి నథనయేలున్ను జెబెదై
కుమాళ్లున్ను ఆయన శిష్యులలో మరి యిద్దరున్ను
౩ కూడియున్నప్పుడు సీమోను పేతురు—నేను చేప
లు పట్టుటకు వెళ్లుతున్నానని వారితో పలికెను.
వారు—మేమున్ను నీతో వస్తామని చెప్పిరి. వారు
బయిలువెళ్లి వెంటనే తమ దోనె యెక్కిరి. అయి
తే ఆ రాత్రి యేమిన్ని పట్టలేదు.
౪ అయితే వుదయమైన తరువాత యేసు దరిని
నిలిచెను. అయినప్పటికిన్ని ఆయన యేసని శిష్యు
౫ లు తెలుసుకొనలేదు. అప్పుడు యేసు—పిల్లలారా
భోజనమునకు మీకు యేమైనా* కలదా అని వారి
౬ తో చెప్పెను. వారు లేదని చెప్పినప్పుడు ఆయన—
దోనె కుడి పక్కనుంచి వలవేయండి అప్పుడు
దొరుకునని చెప్పెను గనుక వారు ఆలాగు వేసి
చేపలు విస్తారమైనందున దాని లాగలేక పోయిరి.
౭ కాబట్టి యేసు ప్రేమించిన ఆ శిష్యుడు—ఈయన
ప్రభువని పేతురుతో చెప్పెను. ప్రభువు వున్నా
డని సీమోను పేతురు విని దిగంబరియైనందున
పైబట్ట వేసుకొని సముద్రములోకి దుమికెను.
భూమికి కొంచెము యెక్కువ తక్కువ యిన్నూరు ౮
మూరల దూరము వున్నందున యితర శిష్యులు చేప
లుగల వల లాగుతూ ఆ చిన్న దోనెలో వచ్చిరి.
అంతట వారు భూమికి రాగానే అక్కడ వేయ ౯
బడిన నిప్పులున్ను వాటిమీద వుంచబడిన చేపలు
న్ను రొట్టెయున్ను చూచిరి. యేసు—మీరు ౧౦
యిప్పుడు పట్టిన చేపలలో కొన్ని తీసుకొని రండని
వారితో చెప్పెను. సీమోను పేతురు యెక్కి ౧౧
నూట యేబదిమూడు గొప్ప చేపలతో నిండుకొని
యున్న వలను భూమికి లాగెను. అంత విస్తార ౧౨
మైనవైనప్పటికిన్ని ఆ వల పిగలలేదు. యేసు—
మీరు రండి భోజనము చేయండని వారితో చెప్పె
ను. అయితే ఆయన ప్రభువని వారికి తెలిసినం
దున—నీవు యెవడవని శిష్యులలో యెవడున్ను
అడుగుటకు ధైర్యము తెచ్చుకొనలేదు. అప్పుడు ౧౩
యేసువచ్చి ఆ రొట్టెయున్ను చేపలున్ను పుచ్చు
కొని వారికిచ్చెను. యేసు చనిపోయిన వారిలో ౧౪
నుంచి లేచి తన శిష్యులకు తన్ను అగుపరుచుకొ
న్నది యిది మూడవసారి.
అంతట వారు భోజనము చేసిన తరువాత యే ౧౫
సు—యోనా కుమారుడవైన సీమోనా వీరి కంటే
నన్ను మిక్కిలీ ప్రేమిస్తున్నావా అని సీమోను
పేతురుతో చెప్పెను. అతడు—అవును ప్రభు
వా నేను నిన్ను ప్రేమిస్తున్నానని యెరుగుదువని
ఆయనతో చెప్పినప్పుడు యేసు—నా గొర్రెపిల్లల
ను పోషించుమని ఆయనతో చెప్పెను. తిరిగీ ౧౬
ఆయన—యోనా కుమారుడవైన సీమోనా నన్ను
ప్రేమిస్తున్నావా అని రెండోసారి అతనితో పలి
కెను. అతడు—అవును ఓ ప్రభువా నేను నిన్ను
ప్రేమిస్తున్నానని నీవు యెరుగుదువని ఆయనతో
చెప్పెను. ఆయన—నా గొర్రెలను మేపుమని
చెప్పెను. మూడోసారి ఆయన—యోనా కుమా ౧౭
రుడవైన సీమోనా నన్ను ప్రేమిస్తున్నావా అని
ఆయనతో పలికెను. నన్ను ప్రేమిస్తున్నావా
అని అతనితో మూడోసారి పలికినందున పేతురు
దుఃఖించి—ఓ ప్రభువా నీవు సమస్తమున్ను యె
రిగిన వాడవు నిన్ను ప్రేమిస్తున్నానని యెరుగుదు
వని ఆయనతో చెప్పెను. యేసు—నా గొర్రెలను ౧౮
పోషించుము నిజమే నిజమే నేను నీతో చెప్పేదే
మంటే నీవు యౌవనస్థుడవైనప్పుడు నీకు నీవే నడు

* లేక, యే చేపయైనా.

ము కట్టుకొని నీకు యిష్టమైన చోటుకు వెళ్లితివి
అయితే నీవు ముసలివాడవైనప్పుడు నీ చేతులు
నీవు చాతువు వేరొకడు నీ నడుము కట్టి నీకు యి
ష్టము కాని చోటుకు నిన్ను మోసుకొని పోవునని
౧౯ ఆయనతో పలికెను. ఆయన యెటువంటి మరణ
మువల్ల దేవుని మహిమపరుచునో దాని సూచించి
యిది చెప్పెను అప్పుడు దీని చెప్పి నన్ను వెంబ
డించుమని ఆయనతో పలికెను.
౨౦ అప్పుడు పేతురు వెనుకకు తిరిగి యేసు ప్రే
మించినటువంటిన్ని భోజన పజ్తిలో ఆయన రొ
మ్మున ఆనుకొని—ప్రభువా నిన్ను అప్పగించేవాడు
యెవడు అని పలికినటువంటిన్ని శిష్యుడు వెంబ
౨౧ డించుట చూచెను. పేతురు అతని చూచి—
ప్రభువా యీయన యేమి (పొందునని) యేసుతో
చెప్పెను. అప్పుడు యేసు—నేను వచ్చేపర్యంతము ౨౨
ఆయన వుండవలెనని నాకు యిష్టమైతే అది నీకేమి.
నీవు నన్ను వెంబడించుమని అతనితో చెప్పెను. ౨౩
కాబట్టి ఆ శిష్యుడు చావడనే మాట సహోదరు
లలో ప్రచురమాయెను. అయితే-చావడని యేసు
ఆయనతో చెప్పక—నేను వచ్చేపర్యంతము ఆయన
వుండవలెనని నాకు యిష్టమైతే అది నీకేమి అని
చెప్పెను.
వీటిని గురించి సాక్ష్యమిస్తూ వీటిని వ్రాసిన ౨౪
శిష్యుడు యీయనే. ఆయన సాక్ష్యము నిజమని ౨౫
యెరుగుదుము. అయితే యేసు చేసినవి యింకా
అనేకమైనవిన్ని కలవు. అవన్ని వేరుగా వ్రాయ
బడినట్టయితే ఆ వ్రాయబడిన గ్రంథములకు లోక
మంతైనా స్థలము చాలదని తలుస్తున్నాను.

# THE EPISTLE TO THE ROMANS.

## అపొస్తలుడైన పౌలు
# రోమాలో వున్నవారికి పంపిన పుత్తరము.

### ౧ పర్వము.

౧-౭ దావీదు సంతానమందు మాంస విషయమై
పుట్టి పరిశుద్ధతయొక్క ఆత్మ విషయమై మృతుల
పునరుత్థానమువల్ల దేవుని కుమారుడని బలముతో
నిర్ణయించబడిన తన కుమారుడైన యేసు క్రీస్తు
అనే మన ప్రభువును గురించి దేవుడు తన ప్రవక్తల
మూలముగా పరిశుద్ధ లేఖనములలో పూర్వమందు
వాగ్దత్తముచేసిన ఆయన సువార్త కొరకు యేర్ప
రచబడినటువంటిన్ని అపొస్తలవుటకు పిలువబడిన
టువంటిన్ని యేసు క్రీస్తు సేవకుడైనటువంటిన్ని
పౌలు దేవుని ప్రియులై పరిశుద్ధులవుటకు పిలువబ
డిన రోమాలోవున్న వారందరికిన్ని—మన తండ్రి,
యైన దేవుని వల్లనున్ను ప్రభువైన యేసు క్రీస్తు
వల్లనున్ను మీకు కృపయున్ను సమాధానమున్ను
కలుగును గాక. ఆయన నామము కొరకు సమస్త
దేశస్థులలో విశ్వాసమునకు విధేయత కలిగే నిమిత్త
ము ఆయనవల్ల కృపయున్ను అపొస్తలుత్వమున్ను
పొందితిమి. వారిలో మీరున్ను యేసు క్రీస్తు
యొక్క* పిలువబడినవారై యున్నారు.
౮ మొదట మీ విశ్వాసము లోకమందంతటా
ప్రచురము చేయబడెనని మీ అందరి నిమిత్తము
యేసు క్రీస్తు ద్వారా నా దేవుని సంతోషస్తుతి చేస్తు
౯ న్నాను యెందుకంటే వొక వేళ నేను యేలాగైనా
౧౦ దేవుని చిత్తమువల్ల మీ యొద్దికి వచ్చుటకు మంచి
సమయము పొందే నిమిత్తము నా ప్రార్థనల
యందు నిత్యమున్ను వేడుకొంటూ మిమ్మును యెడ
తెగకుండా జ్ఞాపకము చేసుకొంటున్నాననుటకై
నేను యెవని కుమారుని సువార్తయందు నా ఆత్మ
౧౧ తో ఆయనను కొలుస్తున్నానో ఆ దేవుడు నా
సాక్షియై యున్నాడు యెందుకంటే మీరు స్థిరప ౧౨
రచబడే నిమిత్తమై—అనగా మీ నా అన్యోన్య
విశ్వాసమువల్ల మీ మధ్యను నేను మీతో కూడా
క్షేమబోధ పొందే నిమిత్తమై మీకు యేదో వొక
ఆత్మసంబంధ వరము యిచ్చే కొరకు మిమ్మును చూడ
వలెనని అపేక్షిస్తున్నాను.
అయితే సహోదరులారా యితర దేశస్థులలో ౧౩
యేలాగునో ఆలాగున మీలోనున్ను నాకు కొంత
ఫలము దొరికే నిమిత్తము మీ యొద్దికి వచ్చుటకు
అనేక పర్యాయములు యోచనచేసి యిదివరకు
ఆతంకపరచబడిన సంగతి మీకు తెలియక వుండ
కూడదని కోరుతున్నాను. నేను హెల్లేనీయుల ౧౪
కున్ను బర్బరస్థులకున్ను జ్ఞానులకున్ను అవివేకులకు
న్ను ఋణస్థుడనై యున్నాను గనుక నా వల్లనై ౧౫
నంత మట్టుకు రోమాలో వున్న మీకున్ను సువా
ర్త ప్రకటించుటకు సిద్ధముగా వున్నాను.
ఎందుకంటే నేను క్రీస్తు సువార్తను గురించి ౧౬
సిగ్గుపడేది లేదు యెందుకంటే నమ్మే ప్రతివానికిన్ని.
మొదట యూదియునికి హెల్లేనీయునికి కూడా
అది రక్షణ కొరకు దేవుని శక్తియై యున్నది యెం ౧౭
దుకంటే—నీతిమంతుడు విశ్వాసమువల్ల బ్రతుకు
నని వ్రాయబడిన ప్రకారము విశ్వాస నిమిత్తము
విశ్వాసమువల్లనైన దేవుని నీతి (ఆ సువార్తలో)
బయిలుపరచబడి యున్నది.
ఎందుకంటే సత్యమును దుర్నీతిచేత అడ్డగించే ౧౮
మనుష్యులయొక్క సమస్తమైన భక్తిహీనతకున్ను
దుర్నీతికిన్ని విరోధముగా దేవుని కోపము ఆకా
శమునుంచి బయిలుపరచబడుతున్నది యెందుకంటే ౧౯
దేవుని గురించి యేమి తెలియబడ వచ్చునో అది

* లేక, వల్ల.

వారిలో విశదమై యున్నది యెందుకంటే దేవుడు
౨౦ అది వారికి విశదపరిచెను యేలాగంటే ఆయన
యొక్క అదృశ్యమైనవి అనగా ఆయనయొక్క
అనంతమైన శక్తిన్ని దేవత్వమున్ను జగదుత్పత్తి మొ
దలుకొని చేయబడిన వాటివల్ల తెలియబడి అగుప
డుతున్నవి గనుక వారు నిరుత్తరులై యున్నారు
౨౧ యెందుకంటే వారు దేవుని తెలిసిన్ని ఆయన దేవు
డని* మహిమపరచకనున్ను కృతజ్ఞులు కాకనున్ను
వుండిరి. అయితే వారు తమ వితర్కములందు
౨౨ వ్యర్థులైరి. వారి అవివేక హృదయము అంధకార
యుక్తమాయెను. తాము జ్ఞానులమని చెప్పుకొని
౨౩ బుద్ధిహీనులైరి. అప్పుడు వారు అక్షయుడైన
దేవుని మహిమను క్షయమయ్యే మనుష్యునియొక్క
యున్ను పక్షులయొక్కయున్ను నాలుగు కాళ్ల
జంతువులయొక్కయున్ను పురుగులయొక్కయున్ను
ప్రతిమా స్వరూపమునకు మార్చిరి.
౨౪ మరిన్ని ఆ హేతువు చేతను తమలో తాము
తమ శరీరములను అవమానపరుచుకొనుటకు దేవుడు
వారిని వారి హృదయముల కామములయందు
౨౫ అపవిత్రతకు అప్పగించెను యెందుకంటే వారు
దేవుని సత్యమును అబద్ధమునకు మార్చి సృష్టికర్తకు
ప్రతిగా సృష్టియందు భక్తి కలిగి ఆరాధించేవా
రైరి. ఆయనే యెప్పటికిన్ని స్తోత్రార్హుడై యు
౨౬ న్నాడు—ఆమేన్. అందుచేతను దేవుడు వారిని
ఘనహీన దురాశలకు అప్పగించెను యేలాగంటే
వారి స్త్రీలున్ను స్వాభావికమైన ప్రయోజనమును
౨౭ స్వభావమునకు విరోధమైన దానికి మార్చిరి. ఆ
ప్రకారమే పురుషులు కూడా స్త్రీయొక్క స్వాభా
వికమైన ప్రయోజనమును విడిచి ఒకనియందు
ఒకడు వుంచిన మోహము చేతను దహించబడి
పురుషులతో పురుషులు అవాచ్యమైనది చేసి తమ
తప్పితమునకు తగిన ఫలము తమలో పొందిరి.
౨౮ మరిన్ని తమ జ్ఞాపకమందు దేవుని వుంచుకొను
టకు వారు యెంచలేదు గనుక తగని కార్యములు
చేయుటకు దేవుడు వారిని యెన్నికలేని మనస్సుకు
౨౯ అప్పగించెను. అటువంటి వారు సమస్త దుర్నీతి
వేశ్యాగమనము చెడుతనము ధనాపేక్ష అపకారము
అనే వాటిచేత నింపబడి అసూయ నరహత్య జగ
డము కపటము మత్సరము అనే వాటితో నిండు
౩౦ కొని కొండెగాండ్లున్ను అపవాదకులున్ను దేవద్వే
షకులున్ను హింసకులున్ను గర్విష్ఠులున్ను బింకము
లాడేవారున్ను చెడ్డ వాటిని కల్పించేవారున్ను
తలిదండ్రులకు అవిధేయులున్ను బుద్ధిహీనులున్ను ౩౧
మాట తప్పేవారున్ను వాత్సల్యరహితులున్ను అసం
ధితులున్ను నిర్దయులున్నయి అటువంటి కార్యము
లను చేసేవారు మరణమునకు తగినవారన్న దేవుని ౩౨
న్యాయపు తీర్పు తెలిసియుండిన్ని వీరు వాటిని
చేయుట మాత్రమే కాకుండా వాటిని చేసే
వారితో సంతోష సహవాసము చేస్తున్నారు.

## ౨ పర్వము.

కాబట్టి ఓ మనుష్యుడా తీర్పు చేసే నీవు యెవ ౧
డవైనప్పటికిన్ని నిరుత్తరుడవై యున్నావు యెందు
కంటే నీవు యే విషయమై పరునికి తీర్పు చేస్తి
న్నావో ఆ విషయమై నీకు నీవే శిక్ష విధించుకొం
టున్నావు యెందుకంటే తీర్పు చేసే నీవున్ను
వాటినే చేస్తున్నావు. మరిన్ని అటువంటి వాటిని ౨
చేసేవారి యెడల దేవుని తీర్పు సత్య ప్రకారము
గా వున్నదని యెరుగుదుము. అటువంటి వాటిని ౩
చేసేవారికి తీర్పు చేసి వాటినే చేసే ఓ మనుష్యుడా
నీవు దేవుని తీర్పును తప్పించుకొందువని తలంచు
కొంటున్నావా లేక దేవుని యుపకారము నిన్ను ౪
పశ్చాత్తాపమునకు† తెచ్చేది అని యెరుగక ఆయన
యుపకారముయొక్క ఐశ్వర్యమునున్ను ఓర్పు
నున్ను దీర్ఘశాంతమునున్ను అలక్ష్యము చేస్తు
న్నావా. అయితే పశ్చాత్తాపపడని నీ కఠిన హృ ౫
దయ ప్రకారముగా దేవుని న్యాయపు తీర్పు బయి
లుపడే వుగ్ర దినమందలి వుగ్రతను నీకు నీవే
కూడబెట్టుకొంటున్నావు. ఆయన ప్రతి వాని ౬
కిన్ని వాని వాని క్రియల చొప్పున ప్రతి ఫల
మిచ్చును. సత్క్రియలలో ఓపికగా నిలిచి మహి ౭
మను ఘనమునున్ను అమరత్వమునున్ను వెతికే
వారికి నిత్యజీవమిచ్చును. అయితే స్వార్థప ౮
రులై సత్యమునకు విధేయులు కాక దుర్నీతికి
విధేయులైన వారికి వుగ్రతయున్ను కోపమున్ను—
దుష్కార్యము చేసే ప్రతి మనుష్యుని ఆత్మకున్ను—
మొదట యూదునికి హెల్లేనీయునికి కూడా— ౯
శ్రమయున్ను వేదనయున్ను అయితే సత్క్రియ ౧౦
చేసే ప్రతివానికిన్ని—మొదట యూదునికి హెల్లే
నీయునికి కూడా—మహిమయున్ను ఘనమున్ను
సమాధానమున్ను కలుగును యెందుకంటే దేవునికి ౧౧
పక్షపాతము లేదు.

* లేక, దేవునివలె. † లేక, మారు మనస్సుకు.

౧౨ ఎందుకంటే ఆజ్ఞాప్రమాణము లేనప్పుడు పాప
ముచేసిన వారందరున్ను ఆజ్ఞాప్రమాణము లేకుండా
నశింతురు మరిన్ని ఆజ్ఞాప్రమాణము కింద పాపము
చేసిన వారందరున్ను ఆజ్ఞాప్రమాణమువల్ల తీర్పు
౧౩ పొందుదురు యెందుకంటే ఆజ్ఞాప్రమాణము వినే
వారు దేవుని దృష్టికి నీతిమంతులు కారు అయితే
ఆజ్ఞాప్రమాణము చొప్పున జరిగించే వారే నీతి
౧౪ మంతులని యెంచబడుదురు యెందుకంటే ఆజ్ఞా
ప్రమాణము లేని అన్యజనులు స్వభావము చేతను
ఆజ్ఞాప్రమాణముయొక్క వాటిని చేసేటప్పుడు వీరు
ఆజ్ఞాప్రమాణము లేనివారై తమకు తామే ఆజ్ఞా
౧౫ ప్రమాణమై యున్నారు. అటువంటివారు తమ
హృదయములందు వ్రాయబడిన ఆజ్ఞాప్రమాణము
యొక్క క్రియను చూపిస్తున్నారు. అందుకు
వారి మనస్సాక్షీ వారితో కూడా సాక్ష్యమిస్తూ
వుండును. వారి తలంపులు మధ్యమధ్యను నింది
స్తున్నైనా లేక క్షమిస్తున్నైనా వుండును. నా
౧౬ సువార్త ప్రకారము దేవుడు యేసు క్రీస్తు ద్వారా
మనుష్యుల రహస్యములను గురించి తీర్పు చేసే
దినమందు (కలుగును.)
౧౭ ఇదుగో నీవు యూదుడనే పేరు పెట్టుకొని
ఆజ్ఞాప్రమాణమును ఆశ్రయించి దేవుని గురించి
౧౮ అతిశయపడి ఆయన చిత్తము యెరిగి ఆజ్ఞాప్రమా
ణమువల్ల బోధపరచబడి భేదమైన వాటిని వివే
౧౯ చించ గలవాడవు. మరిన్ని ఆజ్ఞాప్రమాణములో
సత్యముయొక్కయున్ను జ్ఞానముయొక్కయున్ను
క్రమము* కలిగి—నేనే గుడ్డివారికి తోవ చూపిం
చేవాడను చీకటిలో వుండే వారికి వెలుగును అవి
౨౦ వేకులకు వుపదేశకుడను బాలులకు బోధకుడను
౨౧ అని నిశ్చయించుకొంటున్నావు. కాబట్టి పరునికి
బోధపరిచే నీవు నీకు నీవే బోధపరుచుకొనవా.
దొంగతనము చేయ వద్దని ప్రకటించే నీవు దొంగ
౨౨ తనము చేస్తున్నావా. వ్యభిచరించవద్దని చెప్పే
నీవు వ్యభిచరిస్తున్నావా. విగ్రహములయందు
అసహ్యపడే నీవు గుడిలో వున్నవి అపహరిస్తున్నా
౨౩ వా. ఆజ్ఞాప్రమాణమును గురించి అతిశయపడే
నీవు ఆజ్ఞాప్రమాణమును మీరుటవల్ల దేవుని అవ
౨౪ మానపరుస్తున్నావా యెందుకంటే మీ ద్వారా
దేవుని నామము అన్యజనుల మధ్యను దూషించ
బడుతున్నదని వ్రాయబడిన ప్రకారమే అవును.
౨౫ యెందుకంటే నీవు ఆజ్ఞాప్రమాణము గైకొం
టూవుంటే సున్నతి ప్రయోజనము అయితే ఆజ్ఞా
ప్రమాణమును అతిక్రమించేవాడవైతే నీ సున్నతి
అసున్నతి అయినది. కాబట్టి సున్నతి లేనివాడు ౨౬
ఆజ్ఞాప్రమాణముయొక్క నిర్ణయములను గైకొని
నట్టయితే అతని అసున్నతి సున్నతిగా యెంచబడ
దా మరిన్ని స్వాభావికమైయుండే అసున్నతి ౨౭
ఆజ్ఞాప్రమాణము గైకొంటే లేఖనమున్ను సున్నతి
యున్ను కలిగిన్ని ఆజ్ఞాప్రమాణమును మీరే నీకు ౨౮
తీర్పు చేయదా యెందుకంటే బాహ్యముగా యూ
దుడైనవాడు యూదుడు కాడు మాంసమందు బా ౨౯
హ్యమైన సున్నతి సున్నతికాదు. అయితే అం
తరంగమందు యూదుడైన వాడు యూదుడు ఆత్మ
లో వున్న హృదయపు సున్నతియేగాని లేఖనము
లోనే యున్నది సున్నతి కాదు. అతని స్తోత్రము
మనుష్యులచేతను కాదు అయితే దేవుని చేతనవును.

## 3 పర్వము.

ఆలాగైతే యూదుని అతిశయము యేమిటి ౧
సున్నతి లాభము యేమిటి. ప్రతి విషయమై అది ౨
విస్తారము. మొదటిది యేదంటే వారికే గదా
దేవోక్తులు అప్పగించబడెను యెందుకంటే కొం ౩
దరు అవిశ్వాస్యులైతేనేమి వారి అవిశ్వాస్యము
దేవుని విశ్వాస్యతను వ్యర్థము చేసునా. ఆ వూహ ౪
కూడదు. అయితే—నీవు నీ వాక్యముల యందు
నీతిమంతుడవని తీర్చబడుటకున్ను నీవు విమర్శిం
చబడేటప్పుడు గెలుచుటకున్ను అని వ్రాయబడిన
ప్రకారముగా ప్రతి మనుష్యుడున్ను అబద్ధికుడైన
ప్పటికిన్ని దేవుడు సత్యవంతుడని అనుకో వలెను.
సరి. అయితే మన దుర్నీతి దేవుని నీతిని ౫
దృఢపరిచినట్టయితే యేమందుము. దండన చేసే ౬
దేవుడు దుర్నీతిమంతుడా ఆ వూహ కూడదు. మ
నుష్యప్రకారముగా పలుకుతున్నాను. యెందు
కంటే ఆ పక్షమందు దేవుడు లోకమునకు యేలా
గు తీర్పు చేయగలడు యెందుకంటే దేవుని సత్య ౭
ము నా అబద్ధమువల్ల ఆయన మహిమ యెడల విస్త
రించిన పక్షమందు నేను యింకా పాపినని తీర్చ
బడేదిన్ని యెందుకు—మేలు వచ్చే కొరకు కీడు ౮
చేతామని మేము అంటున్నామని కొందరు మమ్మ
ను దూషించి చెప్పే ప్రకారముగా మేము యెం
దుకు చెప్ప రాదు—వారి శిక్షావిధి న్యాయమై
యున్నది.
ఆలాగైతే యేమి. మేము అతిశ్రేష్ఠులమా ౯
యెంత మాత్రమున్ను కాము యెందుకంటే యూ
దులేమి హెల్లేనీయులేమి వారందరున్ను పాపను

* లేక, స్వరూపము.

నకు లోబడి యున్నారనుటకు ముందుగా హేతు
౧౦ వు చెప్పి యున్నాము. ఆ ప్రకారము వ్రాయ
బడి యున్నది యేలాగంటే—
౧౧ నీతిమంతుడు వొక్కడైనా లేడు. గ్రహించే
వాడెవడున్ను లేడు. దేవుని వెతికేవాడెవడున్ను
లేడు.
౧౨ అందరున్ను తోవ తప్పియున్నారు యేకముగా
పనికిమాలిన వారైరి. మేలు చేసే వాడు లేడు—
వొక్కడైనా లేడు.
౧౩ వారి గొంతుక తెరచిన సమాధియై యున్నది—
తమ నాలుకలచేత మోసము చేసి యున్నారు.
పాముల విషము వారి పెదవుల కింద వున్నది.
౧౪ వారి నోరు శాపముతోనున్ను చేదుతోనున్ను
నిండియున్నది.
౧౫ వారి పాదములు రక్తము చిందించుటకు త్వరప
డుతూ వున్నవి.
౧౬ నాశనమున్ను వుపద్రవమున్ను వారి మార్గ
ములలో వున్నవి.
౧౭ క్షేమమార్గమును వారు తెలుసుకొనలేదు.
౧౮ వారి కన్నుల యెదుట దేవుని భయము లేదు.
౧౯ మరిన్ని ప్రతి నోరున్ను మూయబడే కొరకు
న్ను సర్వలోకమున్ను దేవుని శిక్షావిధికి లోనై
యుండే కొరకున్ను ఆజ్ఞాప్రమాణము వేటిని చెప్పు
తున్నదో వాటిని ఆ యాజ్ఞాప్రమాణమునకు లో
౨౦ బడే వారితో పలుకుతున్నదని యెరుగుదుము యెం
దుకంటే ఆజ్ఞాప్రమాణపు క్రియల వల్ల యే మను
ష్యుడున్ను ఆయన దృష్టికి నీతిమంతుడని తీర్పు
పొందలేదు యెందుకంటే ఆజ్ఞాప్రమాణము వల్ల
పాపము తెలియపరచబడుతున్నది.
౨౧ అయితే యిప్పుడు ఆజ్ఞాప్రమాణము లేకుండా*
దేవుని నీతి—అనగా ఆజ్ఞాప్రమాణము వల్లనున్ను
౨౨ ప్రవక్తల వల్లనున్ను సాక్ష్యము పొందుతూ యేసు
క్రీస్తు విశ్వాసమువల్లనైన దేవుని నీతి అందరికిన్ని
నమ్మేవారందరి మీదికిన్ని తేటపరచబడియున్నది
౨౩ యెందుకంటే యే భేదమున్ను లేదు యెందుకంటే
౨౪ అందరున్ను పాపము చేసి దేవుని మహిమ† పొం
దక క్రీస్తు యేసువల్లనైన విమోచనక్రయము ద్వా
రా ఆయనయొక్క కృపచేతను వుచితముగా నీతి
౨౫ మంతులని తీర్చబడుదురు. దేవుని ఓరిమివల్ల పూ
ర్వమందు జరిగిన పాపములు క్షమించబడినందున
౨౬ ఆయన తన నీతిని అగుపరిచే నిమిత్తమై—అనగా
తాను నీతిమంతుడనున్ను యేసు విశ్వాసమువల్ల
నైన వాని నీతిమంతుడని తీర్చే వాడనున్నై యుం
డే కొరకు యిప్పటి కాలమందు తన నీతిని అగుప
రిచే నిమిత్తమై యీయన రక్తమందు విశ్వాసముం
చుటవల్ల ప్రాయశ్చిత్తార్థమైన బలిగా‡ యీయనను
బయిలుపరిచెను.
కాబట్టి ఆ యాత్మస్తుతి యెక్కడ. అది పో ౨౭
గొట్టబడెను. యే ఆజ్ఞాప్రమాణమువల్ల—క్రియల
దానివల్లనా. కాదు. విశ్వాసపు ఆజ్ఞాప్రమాణ
మువల్లనే. కాబట్టి§ ఆజ్ఞాప్రమాణపు క్రియలులే ౨౮
కుండా|| మనుష్యుడు విశ్వాసముచేత నీతిమంతు
డని తీర్చబడునని యెంచుతున్నాము. ఆయన ౨౯
యూదులకు మాత్రమే దేవుడా. అన్యజనులకున్ను ౩౦
దేవుడు కాడా. అన్యజనులకున్ను అవును యెందు
కంటే విశ్వాసమువల్ల సున్నతివారినిన్ని విశ్వాసము
ద్వారా సున్నతిలేని వారినిన్ని నీతిమంతులని తీర్చే
దేవుడు వొక్కడే. కాబట్టి విశ్వాసమువల్ల మనము ౩౧
ఆజ్ఞాప్రమాణము వ్యర్థము చేస్తున్నామా. కాదు
అయితే ఆజ్ఞాప్రమాణము స్థిరపరుస్తున్నాము.

## ౪ పర్వము.

కాబట్టి మన తండ్రియైన అబ్రాహాముకు మాంస ౧
విషయమై యేమి దొరికెనని చెప్పుదుము యెందు ౨
కంటే అబ్రాహాము క్రియలవల్ల నీతిమంతుడని
తీర్చబడినట్టయితే అతనికి అతిశయాస్పదము కలు
గును. అయితే దేవుని యెదట లేదు యెందుకంటే ౩
లేఖనము యేమి చెప్పుతున్నది—అబ్రాహాము దేవుని
నమ్మెను అది అతనికి నీతి నిమిత్తము యెంచబడెను.
అయితే పని చేసే వానికి జీతము ఋణమే గాని ౪
కృపగా యెంచబడదు. అయితే పని చేయక ౫
భక్తి హీనుని నీతిమంతుడని తీర్చే వాని యందు
విశ్వాసముంచే వానికి వాని విశ్వాసము నీతి నిమి
త్తము యెంచబడును.
ఆ ప్రకారమే దేవుడు క్రియలు లేకుండా ౬
యెవని నీతిగలవాడని యెంచునో ఆ మనుష్యుని
భాగ్యమును దావీదు కూడా చెప్పుతున్నాడు యేలా ౭
గంటే—యెవరి అపరాధములు క్షమించబడెనో
యెవరి పాపములు కప్పి వేయబడెనో వారు
భాగ్యవంతులు—ప్రభువు యెవని యందు పాపము ౮
యెంచడో ఆ మనుష్యుడు భాగ్యవంతుడు.
కాబట్టి ఈ శుభవచనము సున్నతివారిని గురిం ౯
చినదా లేక సున్నతి లేని వారిని గురించినదైన్నా

* లేక, కంటే వేరేలాగున. † లేక, మెప్పు. ‡ లేక, సమాధానబలిగా.
§ యెందుకంటే, అనేక ప్రతులలో వున్నది. || లేక, క్రియలకంటే వేరేలాగున.

నగా యెందుకంటే విశ్వాసము అబ్రాహామునకు నీతి
నిమిత్తము యెంచబడెనని చెప్పుతున్నాము.
౧౦ మంచిది. అది యేలాగు యెంచబడెను అత
నికి సున్నతి కలిగినప్పుడా లేక సున్నతి లేనప్పుడా.
సున్నతి కలిగినప్పుడు కాదు—సున్నతి లేనప్పుడే.
౧౧ మరిన్ని సున్నతి లేకనే నమ్మే వారందరికిన్ని నీతి
౧౨ యెంచబడే నిమిత్తమై ఆయన వారి తండ్రియయే
కొరకున్ను సున్నతి గల వారే కాకుండా మా
తండ్రియైన అబ్రాహామునకు సున్నతి లేనప్పుడు
ఆయనకు కలిగిన విశ్వాసముయొక్క అడుగుల
యందు నడిచే వారికిన్ని సున్నతి గలవారి తండ్రి
యయే కొరకున్ను అతనికి సున్నతి లేనప్పుడు కలి
గిన విశ్వాసమువల్లనైన నీతికి ముద్రగా సున్నతి
యనే గురుతు పొందెను.
౧౩ ఎందుకంటే అబ్రాహాము జగద్బాధ్యుడవును
అనే వాగ్దత్తము విశ్వాసపు నీతివల్లనే గాని ఆయన
కైనా ఆయన సంతానమునకైనా ఆజ్ఞాప్రమాణము
౧౪ వల్ల చేయబడ లేదు. ఎందుకంటే ఆజ్ఞాప్రమా
ణపు వారు బాధ్యులైతే విశ్వాసము వ్యర్థమవు
౧౫ ను—ఆ వాగ్దత్తము కొట్టివేయబడును యెందుకంటే
ఆజ్ఞాప్రమాణము కోపమును కలుగచేస్తున్నది యెం
దుకంటే ఆజ్ఞాప్రమాణము యెక్కడ వుండదో
౧౬ అక్కడ అతిక్రమమున్ను లేదు. ఈ హేతువు
చేతను ఆ యావత్సంతతికిన్ని ఆజ్ఞాప్రమాణపు
వారికి మాత్రమే కాకుండా చనిపోయిన వారిని
బ్రతికించేటటువంటిన్ని లేని వాటిని వున్నవాటి
వలె పిలిచేటటువంటిన్ని అబ్రాహాము నమ్మినటువం
౧౭ టిన్ని దేవుని దృష్టికి—నిన్ను అనేక దేశస్థులకు
తండ్రిగా నియమించితినని వ్రాయబడిన ప్రకా
రము మనకందరికిన్ని తండ్రియై యున్న అబ్రా
హాముయొక్క విశ్వాసముగల వారికిన్ని ఆ వాగ్ద
త్తము దృఢమయే కొరకు కృప చొప్పున కలిగే
నిమిత్తమై విశ్వాసము చేతనైనది.
౧౮ నీ సంతానము యీలాగు వుండునని చెప్ప
బడిన ప్రకారము తాను అనేక దేశస్థులకు తం
డ్రియై యుండే కొరకు ఆయన నిరీక్షణకు విరోధ
౧౯ ముగా నిరీక్షణతో విశ్వసించెను. మరిన్ని విశ్వాస
విషయమై బలహీనుడు కాక ఆయన కొంచెము
యెక్కువ తక్కువ నూరు సంవత్సరముల వయస్సు
కలిగిన్ని అప్పటికి మృతమైయున్న తన దేహము
నైనా సరా యొక్క గర్భమృతినైనా లక్ష్యపెట్ట
౨౦ లేదు. అవిశ్వాసమువల్ల దేవుని వాగ్దత్తమును
గురించి సందేహించ లేదు. అయితే దేవుని మ ౨౧
హిమపరిచి ఆయన యేమి వాగ్దత్తము చేసెనో
దాని నెరవేర్చుటకున్ను శక్తిమంతుడని రూఢిగా
విశ్వసించి విశ్వాసమువల్ల అంతరంగమందు బలప
రచబడెను. అందుచేతను అది ఆయనకు నీతి ౨౨
నిమిత్తము యెంచబడెను.
మరిన్ని అది ఆయనకు యెంచబడెనని ఆయన ౨౩
నిమిత్తము మాత్రమే కాకుండా మన నిమిత్తమున్ను
వ్రాయబడెను యేలాగంటే మన అపరాధముల
నిమిత్తము* అప్పగించబడి మనకు నీతి విధించబడే ౨౪
నిమిత్తము* లేపబడిన మన ప్రభువైన యేసును ౨౫
చచ్చినవారిలోనుంచి లేపిన వాని యందు విశ్వాస
ముంచినట్టయితే అది మనకున్ను యెంచబడును.

## ౫ పర్వము.

కాబట్టి విశ్వాసమువల్ల మనకు నీతి విధించబడి ౧
మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా దేవునితో
సమాధానముగల వారమై యున్నాము. ఆయన ౨
ద్వారా యీ కృపయందు విశ్వాసమువల్ల ప్రవే
శము కూడా మనకు కలిగి యున్నది. అందులో
మనము నిలిచి దేవుని మహిమను† గూర్చిన నిరీ
క్షణ చేత వుత్సహిస్తున్నాము.
అంతేకాకుండా శ్రమ వోర్పునున్ను వోర్పు ౩-౪
పరీక్షనున్ను పరీక్ష నిరీక్షణనున్ను కలుగచేసునని
యెరిగి శ్రమల యందున్ను వుత్సహిస్తున్నాము.
ఆ నిరీక్షణ సిగ్గుపరచదు యెందుకంటే మనకు యి ౫
వ్వబడిన పరిశుద్ధాత్మవల్ల దేవుని ప్రేమ మన హృద
యములలో పోయబడి యున్నది. ఎందుకంటే ౬
మనము యింకా బలహీనులమై యున్నప్పుడు
నిర్ణయ కాలమందు క్రీస్తు భక్తి హీనుల కొరకు
చనిపోయెను. ఎందుకంటే నీతిమంతుని కొరకు ౭
యెవడైనా చనిపోవుట దుర్లభము‡ అయినప్పటి
కిన్ని మంచివాని కొరకు వొకానొకడు వొకవేళ
చనిపోవుటకైనా సాహసించును. అయితే దేవు ౮
డు తన ప్రేమను మనకు దృష్టాంతపరుస్తున్నాడు
యేలాగంటే మనము యింకా పాపులమై యున్న
ప్పుడు క్రీస్తు మన కొరకు చనిపోయెను. కాబట్టి ౯
మరీ యెక్కువగా ఆయన రక్తమువల్ల యిప్పుడు
నీతిమంతులమని తీర్చబడి మనము ఆయన ద్వారా
ఆ వుగ్రతనుంచి రక్షించబడుదుము యెందుకంటే ౧౦
మనము శత్రువులమై యున్నప్పుడు దేవునితో
ఆయన కుమారుని మరణమువల్ల సమాధానపరచ
బడినట్టయితే మనము సమాధానపరచబడి మరీ

* లేక, వల్ల. † లేక, మెప్పును. ‡ లేక, అరుదు.

యెక్కువగా ఆయనయొక్క జీవమువల్ల రక్షణ
పొందుదుము.
౧౧ అంతేకాకుండా మన ప్రభువైన యేసుక్రీస్తు
ద్వారా మనము దేవుని యందున్ను వుత్సహిస్తున్నా
ము. ఆయన ద్వారా మనము యిప్పుడు ఆ సమా
ధానస్థితి పొంది యున్నాము.
౧౨ కాబట్టి వొక్క మనుష్యునివల్ల పాపమున్ను ఆ
పాపమువల్ల మరణమున్ను లోకమందు యేలాగు
ప్రవేశించెనో యీ విధముగా సమస్త మనుష్యు
లున్ను పాపము చేసినందున మరణము అందరి మీ
దనున్ను యేలాగు వ్యాపించెనో (అలాగే వున్న
౧౩ ది.) ఎందుకంటే ఆజ్ఞాప్రమాణము వరకు పాపము
లోకమందు వుండెను అయితే ఆజ్ఞాప్రమాణము
౧౪ లేనప్పుడు పాపము యెంచబడదు. అయినప్పటి
కిన్ని రా గలవానికి గురుతై యున్న ఆదాము
యొక్క అతిక్రమము వలె పాపము చేయని వారి
పయినిన్ని మరణముయొక్క యేలుబడి ఆదాము
మొదలుకొని మోశే పర్యంతమున్ను జరుగుతూ
౧౫ వుండెను. అయినప్పటికిన్ని ఆ అపరాధము యె
టువంటిదో యీ కృపావరము అటువంటిది కాదు
యెందుకంటే వొకని అపరాధమువల్ల అనేకులు
చనిపోయినట్టయితే మరీ యెక్కువగా దేవుని కృప
యున్ను యేసుక్రీస్తు అనే వొక్క మనుష్యుని కృప
చేతనైన వరమున్ను అనేకులకు విస్తరించి యున్నవి.
౧౬ మరిన్ని ఆ వరము పాపము చేసిన వొకనివల్ల వచ్చి
నదానివంటిది కాదు యెందుకంటే ఆ తీర్పు వొక
దానినుంచి శిక్ష విధించబడుటకైనది. అయితే
కృపావరము అనేకమైన అపరాధములనుంచి నీతి
౧౭ విధించబడుటకైనది.* ఎందుకంటే వొకని అప
రాధమువల్లనే మరణము వొకని ద్వారా యేలినట్ట
యితే విస్తారమైన కృపనున్ను నీతి వరమునున్ను
పొందేవారు మరీ యెక్కువగా యేసుక్రీస్తు అనే
౧౮ వొకని ద్వారా జీవమందు యేలుదురు. కాబట్టి
వొక్క అపరాధము సమస్త మనుష్యులకున్ను శిక్షా
విధికి యేలాగు మూలమైనదో అలాగే వొక్క నీతి
విధి† సమస్త మనుష్యులకున్ను జీవసంబంధమైన నీతి
౧౯ విధించబడుటకు మూలమైనది. ఎందుకంటే వొక
మనుష్యుని అవిధేయతవల్ల అనేకులు యేలాగు పా
పులుగా చేయబడిరో అలాగే వొకని విధేయతవల్ల
అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు.
౨౦ అయితే ఆ అపరాధము విస్తరించే కొరకు ఆజ్ఞా
౨౧ ప్రమాణమున్ను ప్రవేశించెను. అయితే పాపము
మరణమందు యేలాగు యేలెనో అలాగే కృప
యున్ను మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా నీతి
వల్ల నిత్యజీవార్థముగా యేలే కొరకు పాపము
యెక్కడ విస్తరించెనో అక్కడ కృప మరీ యెక్కు
వగా ప్రబలమాయెను.

## ౬ పర్వము.

కాబట్టి యేమందుము. కృప విస్తరించేటందుకు ౧
పాపమందు నిలుతుమా. ఆ వూహ కూడదు. ౨
పాప విషయమై ‡ చనిపోయిన మనము అందులో
యికమీదట యేలాగు జీవింతుము. యేసు క్రీస్తుకు ౩
స్నానము పొందిన మనమందరమున్ను ఆయన మర
ణమునకు స్నానము పొందితిమని మీరు యెరుగరా.
కాబట్టి తండ్రి మహిమ§ వల్ల క్రీస్తు యేలాగు ౪
చనిపోయిన వారిలోనుంచి లేపబడెనో అలాగు
మనమున్ను జీవముయొక్క నూతన స్థితిలో నడుచు
కొనే నిమిత్తము మరణమునకు స్నానము పొందుట
వల్ల ఆయనతో కూడా పాతిపెట్టబడితిమి. ఎందు ౫
కంటే మనము ఆయన మరణముయొక్క పోలికెతో
సంయుక్తులమై యుంటే ఆయన పునరుత్థానము
(యొక్క పోలికె)తో అలాగే వుందుము యెందు ౬
కంటే మనము యికమీదట పాపమునకు దాసు
లము కాకుండే నిమిత్తము పాపశరీరము నివారించ
బడే కొరకు మన పాత మనిషి ఆయనతో కూడా
శిలువ వేయబడెనని యెరుగుదుము యెందుకంటే ౭
చనిపోయిన వాడు పాపమునుంచి విడుదల పొంది
యున్నాడు.
మరిన్ని క్రీస్తు చనిపోయిన వారిలోనుంచి లేప ౮
బడి యికమీదట చనిపోడనిన్ని యికమీదట ఆ ౯
యన పయిని మరణమునకు అధికారము లేదనిన్ని
తెలుసుకొని మనము ఆయనతో చనిపోయినట్టయితే
ఆయనతో జీవిస్తున్న వుందుమని నమ్ముతున్నాము.
ఎందుకంటే ఆయన మరణము చూస్తే పాప విష ౧౦
యమై|| వొక మారే చనిపోయెను. ఆయన జీవ
ము చూస్తే దేవుని విషయమై|| జీవిస్తున్నాడు.
అటువలె మీరున్ను పాప విషయమై|| మృతులమ ౧౧
నిన్ని మన ప్రభువైన యేసు క్రీస్తుయందు దేవుని
విషయమై|| జీవితులమనిన్ని మీకు మీరే యెంచు
కొనండి.
కాబట్టి దాని ఆశలకు విధేయులవుటకు పాప ౧౨
మును చావగల మీ శరీరమందు యేలికగా వుండ
నివ్వకండి. మరిన్ని మీ అవయవములను పాప ౧౩
మునకు దుర్నీతియొక్క ఆయుధములుగా అప్ప

* లేక, నీతివిధికైనది. † లేక, నీతివిధించబడుట. ‡ లేక, పాపమువల్ల. § లేక, మెప్పు. || లేక, వల్ల.

గించక దేవునికి మిమ్మును మీరే చనిపోయిన వారి
లోనుంచి జీవించిన వారినిగానున్ను దేవునికి మీ
అవయవములను నీతియొక్క ఆయుధములనుగాను
౧౪ న్ను అప్పగించండి యెందుకంటే మీరు కృపకే
గాని ఆజ్ఞాప్రమాణమునకు లోబడరు గనుక పాప
మునకు మీ మీద ప్రభుత్వము కలుగదు.*
౧౫ ఆలాగైతే మనము కృపకే గాని ఆజ్ఞాప్రమా
ణమునకు లోబడనందున పాపము చేయుదమా.
౧౬ ఆ వూహ కూడదు. మీరు విధేయత కొరకు
మిమ్మును మీరే దేనికి సేవకులనుగా అప్పగించు
కొందురో మరణార్థమైన పాపమునకే గాని నీతి
నిమిత్తము విధేయతకే గాని దేనికి విధేయులై యుం
దురో దాని దాసులై యున్నారని మీరు యెరు
౧౭ గరా. అయితే మీరు పాపముయొక్క సేవకులై
యుంటిరి గాని మీరు యే వుపదేశ రూపమునకు
అప్పగించబడితిరో † దానికి హృదయముతో విధే
౧౮ యులైతిరని దేవుడు స్తుతించబడునుగాక. మరిన్ని
పాపమునుంచి విడుదల పొంది నీతికి దాసులుగా
౧౯ చేయబడితిరి. మీ మాంస బలహీనతవల్ల మనుష్య
ప్రకారము పలుకుతున్నాను యెందుకంటే మీరు
మీ అవయవములను అన్యాయము కొరకు అపవి
త్రతకున్ను అన్యాయమునకున్ను దాసులుగా యే
లాగు అప్పగించితిరో ఆలాగు యిప్పుడు మీ అవ
యవములను పరిశుద్ధత కొరకు నీతి నిమిత్తము దాసు
౨౦ లుగా అప్పగించండి యెందుకంటే మీరు పాపము
యొక్క దాసులైనప్పుడు నీతి విషయమై విడుదల
౨౧ గలవారై యుంటిరి.‡ కాబట్టి అప్పుడు మీకేమి
ఫలము కలిగెను. మీరు యిప్పుడు సిగ్గుపడేవి
గదా యెందుకంటే వాటియొక్క అంతము మరణ
౨౨ మే. అయితే యిప్పుడు పాపమునుంచి విడుదల
పొంది దేవునికి దాసులుగా చేయబడిన మీకు పరి
శుద్ధార్థమైన ఫలమున్ను నిత్యజీవమనే అంతము
౨౩ న్ను కలుగుతున్నవి యెందుకంటే పాపము యొక్క
జీతము మరణము అయితే దేవుని కృపావరము
మన ప్రభువైన యేసు క్రీస్తుయందు నిత్య జీవమై
యున్నది.

## ౭ పర్వము.

సహోదరులారా—యెందుకంటే ఆజ్ఞాప్రమా
ణమును యెరిగిన వారితో పలుకుతున్నాను—మను
ష్యుడు బ్రతికినంత కాలమే ఆజ్ఞాప్రమాణమునకు
అతని మీద ప్రభుత్వము కలదని మీకు తెలియ
దా. ఏలాగంటే పెనిమిటి గల స్త్రీ బ్రతుకుతూ ౨
వుండే ఆ పెనిమిటికి ఆజ్ఞాప్రమాణమువల్ల బద్ధు
రాలై యున్నది. అయితే పెనిమిటి చనిపోతే
ఆమె పెనిమిటి ఆజ్ఞాప్రమాణమునుంచి విడువబడి
యుండును. కాబట్టి పెనిమిటి బ్రతుకుతూ వున్న ౩
ప్పుడు ఆమె వేరొక పురుషునికి కలిగితే వ్యభిచా
రిణి అనబడును అయితే పెనిమిటి చనిపోయినట్ట
యితే ఆ ఆజ్ఞాప్రమాణమునుంచి విడుదల పొందును
గనుక వేరొక పురుషునికి కలిగినప్పటికిన్ని వ్యభి
చారిణి కాక పోవును.
కాబట్టి నా సహోదరులారా మనము దేవుని ౪
కొరకు ఫలము ఫలించే నిమిత్తము మీరు చనిపో
యిన వారిలోనుంచి లేపబడిన వేరొకనికి కలుగు
టకు మీరున్ను క్రీస్తుయొక్క శరీరమువల్ల ఆజ్ఞా
ప్రమాణ విషయమై చనిపోయిన వారైతిరి. ఎం ౫
దుకంటే మనము మాంసమందు వున్నప్పుడు ఆజ్ఞా
ప్రమాణమువల్లనైన పాపముల ప్రేరేపణేచ్ఛలు
మరణము కొరకు ఫలము పుట్టించే నిమిత్తము మన
అవయవములలో కార్యసాధకమై యుండెను.
అయితే యిప్పుడు మనము చనిపోయి దేని యందు ౬
కట్టబడితిమో ఆ ఆజ్ఞాప్రమాణమునుంచి విడువబడి
తిమి గనుక మనము లేఖనముయొక్క పురాతన
స్థితిలో కాకుండా ఆత్మయొక్క నూతన స్థితిలో
సేవిస్తున్నాము.
కాబట్టి మనము యేమందుము. ఆజ్ఞాప్రమా ౭
ణము పాపమా. ఆ వూహ కూడదు. అయితే
ఆజ్ఞాప్రమాణమువల్లనే గాని పాపము నాకు తెలి
యబడదు యెందుకంటే—ఆశించ వద్దని ఆజ్ఞాప్ర
మాణము చెప్పకపోతే ఆశయైనా నాకు తెలియ
దు. అయితే పాపము ఆజ్ఞను హేతువు చేసు ౮
కొని సమస్తవిధమైన ఆశనున్ను నాయందు కలుగ
చేసెను యెందుకంటే ఆజ్ఞాప్రమాణము లేనప్పుడు
పాపము మృతమై యున్నది. అయితే నేను ౯
లోగడ ఆజ్ఞాప్రమాణములేనప్పుడు జీవించితిని.
అయితే ఆజ్ఞ వచ్చినప్పుడు పాపము బ్రతికెను నేను
చనిపోతిని. అప్పుడు జీవార్థమైన ఆజ్ఞ నాకు ౧౦
మరణార్థముగా కనుబడెను యెందుకంటే పాపము ౧౧
ఆజ్ఞను హేతువు చేసుకొని నన్ను మోసపుచ్చి
దానివల్ల నన్ను చంపెను. కాబట్టి ఆజ్ఞాప్రమాణ ౧౨
ము పరిశుద్ధమై యున్నది. ఆజ్ఞ కూడా పరిశుద్ధ

* లేక, పాపము మిమ్మును యేలదు. † లేక, మీకు యే వుపదేశ క్రమము అప్పగించబడెనో.
‡ లేక, నీతి విధించ బడుట వల్ల విడుదల పొందితిరి.

ముగానున్ను న్యాయముగానున్ను మంచిదిగాను
న్ను వున్నది.
౧౩ కాబట్టి యేది మంచిదో అది నాకు మరణకర
మైనదా. ఆ వూహ కూడదు అయితే పాపము
ఆజ్ఞవల్ల అత్యధిక పాపమై యుండే కొరకు పాప
ము మంచిదానివల్ల నాకు మరణము కలుగచేస్తూ
౧౪ పాపముగా అగుపడే కొరకు (మరణ కారణమా
యెను) యెందుకంటే ఆజ్ఞాప్రమాణము ఆత్మసంబం
ధమైనదని యెరుగుదుము అయితే నేను పాపము
నకు లోబడుటకు అమ్మబడి మాంస సంబంధినై
౧౫ యున్నాను. యెందుకంటే నేను యేమి చేస్తు
న్నానో దానికి సమ్మతించను * యెందుకంటే
నాకు యిష్టమైన† దాని జరిగించక నాకు అసహ్య
౧౬ మైనదాని చేస్తున్నాను. అయితే నాకు యిష్టము
కానిది నేను చేసినట్టయితే ఆజ్ఞాప్రమాణము శ్రేష్ఠ
౧౭ మని దానికి సమ్మతిస్తున్నాను. కాబట్టి యికను
అది జరిగించేవాడను నేను కాను అయితే నా
౧౮ యందు నివసించే పాపమే. ఎందుకంటే నా
యందు అనగా నా మాంసమందు మంచిది యేది
న్ని నివసించదని యెరుగుదును యెందుకంటే యి
ష్టము నాకు తటస్థమై యున్నది అయితే సత్కార్య
౧౯ ము చేయుట నాకు కనబడదు యెందుకంటే నాకు
యిష్టమైన† సత్కార్యము చేయక నాకు యిష్టము
౨౦ కాని‡ దుష్కార్యము చేస్తున్నాను. అయితే
నాకు యిష్టము కాని‡ దాని చేసినట్టయితే అది జరి
గించే వాడను యికను నేను కాను నాయందు నివ
౨౧ సించే పాపమే. కాబట్టి సత్కార్యము చేయుట
నాకు యిష్టమైనప్పుడు దుష్కార్యము నాకు తట
స్థమై యున్నదనే వొక ఆజ్ఞాప్రమాణము నాకు
౨౨ కనబడుతున్నది. యేలాగంటే లోపటి మను
ష్యుని ప్రకారము నేను దేవుని ఆజ్ఞాప్రమాణ
౨౩ మందు ఆనందిస్తున్నాను. అయితే నా మనస్సు
యొక్క ఆజ్ఞాప్రమాణముతో కలహించి నా అవయ
వములలోవున్న పాపముయొక్క ఆజ్ఞాప్రమాణము
నకు నన్ను చెరపట్టి లోపరిచే మరియొక ఆజ్ఞాప్ర
మాణమును నా అవయవములలో చూస్తున్నాను.
౨౪ ఆహా నేను దౌర్భాగ్య మనుష్యుడను. ఈ
మరణ శరీరమునుంచి నన్ను యెవడు విడిపించును.
౨౫ మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా (కలిగెనని)
దేవుని స్తుతిస్తున్నాను. కాబట్టి నేను మనస్సుతో
దేవుని ఆజ్ఞాప్రమాణమునకున్ను మాంసముతో పాప
ము యొక్క ఆజ్ఞాప్రమాణమునకున్ను దాసుడనై
యున్నాను.

## ౮ పర్వము.

కాబట్టి క్రీస్తు యేసు యందు వుండే వారికి ౧
యే శిక్షావిధిన్ని లేదు వారు ఆత్మ ప్రకారమేగాని ౨
మాంస ప్రకారము నడవరు. యెందుకంటే క్రీస్తు
యేసులో జీవముగల ఆత్మయొక్క ఆజ్ఞాప్రమాణము
పాప మరణములయొక్క ఆజ్ఞాప్రమాణమునుంచి
నన్ను విడిపించెను. ఎందుకంటే ఆత్మ ప్రకారమే ౩
గాని మాంసప్రకారము నడవని మనయందు ఆజ్ఞా ౪
ప్రమాణముయొక్క నీతి నెరవేర్చబడే నిమిత్తము
దేవుడు పాపమాంసముయొక్క పోలికె యందున్న
పాపము కొరకున్ను తన కుమారుని పంపించి మాం
సములో పాపమును నశింప విధించెను. ఆజ్ఞా
ప్రమాణము మాంసమువల్ల బలహీనముగా వున్నం
దున అది దానికి అసాధ్యమైనది.

ఎందుకంటే మాంసప్రకారమైన వారు మాంస ౫
విషయమైన వాటిని మనస్కరింతురు అయితే ఆత్మ
ప్రకారమైన వారు ఆత్మ విషయమైన వాటిని మన
స్కరింతురు. మరిన్ని మాంసము మనస్కరించుట ౬
మరణము అయితే ఆత్మను మనస్కరించుట జీవ
మున్ను సమాధానమున్నై యున్నది. ఎందుకంటే ౭
మాంసము మనస్కరించుట దేవునికి విరోధమై
యున్నది యెందుకంటే అది దేవుని ఆజ్ఞాప్రమాణ
మునకు లోబడదు—యేమాత్రమున్ను లోబడనేర
దు. మరిన్ని మాంసములో వుండే వారు దేవునికి ౮
యిష్టులు కానేరరు.

అయితే దేవుని ఆత్మ మీలో నివసించినట్టయితే ౯
మీరు ఆత్మలోనే గాని మాంసములో వుండరు.
అయితే యెవడైనా క్రీస్తు యాత్మ లేనివాడైతే అతని
వాడు కాడు. అయితే క్రీస్తు మీలో వుంటే ౧౦
పాపమువల్ల శరీరము మృతమవునుగాని నీతివల్ల §
ఆత్మ జీవమవును. మరిన్ని యేసును చనిపోయిన ౧౧
వారిలోనుంచి లేపిన వానియొక్క ఆత్మ మీలో
నివసించినట్టయితే క్రీస్తును చనిపోయిన వారిలో
నుంచి లేపిన వాడు మీలో నివసించే ఆయన
యొక్క ఆత్మ నిమిత్తము మీ మృతమైన శరీరముల
నున్ను జీవింపచేసును.

కాబట్టి సహోదరులారా (ఆత్మకేగాని) మాంస ౧౨
ప్రకారము జీవించుటకు మాంసమునకు ఋణస్థ

* లేక, అది నాకు తెలియదు. † లేక, నేనుకోరే. ‡ లేక, నేను కోరని.
§ లేక, నీతి విధించబడుటవల్ల.

లము కాము యెందుకంటే మీరు మాంస ప్రకా
౧౩ రము జీవించినట్టయితే చావనై యుందురు. అయి
తే మీరు ఆత్మ చేతను శరీరముయొక్క క్రియలను
౧౪ చంపినట్టయితే జీవింతురు యెందుకంటే దేవుని
ఆత్మ చేత యెందరు నడిపించబడుదురో వారే
౧౫ దేవుని కుమాళ్లయి యున్నారు యెందుకంటే మీరు
తిరిగీ భయపడుటకు దాస్యపు ఆత్మ పొంద లేదు
అయితే కుమారస్థితి ఆత్మ పొందితిరి. దానివల్ల*
౧౬ అబ్బా తండ్రీ అని మొర బెట్టుతున్నాము. మన
ము దేవుని పిల్లలమై యున్నామని ఆత్మ తానే మన
౧౭ ఆత్మతో కూడా సాక్ష్యమిస్తున్నది. మరిన్ని పిల్లల
మైతే బాధ్యులమున్ను—అనగా దేవుని బాధ్యుల
మున్ను క్రీస్తుతో కూడా బాధ్యులమునై యు
న్నాము. ఆయనతో శ్రమపడుతూ వుంటే ఆయ
నతో మహిమపరచపడుటకు సుమీ యెందుకంటే
౧౮ యిప్పటి కాలపు శ్రమలు మన యెడల† ప్రత్య
క్షము కాబోయే మహిమ యెదుట యెన్న తగినవి
౧౯ కావని యెంచుకొంటున్నాను యెందుకంటే సృష్టి
తేరి పారచూస్తూ దేవుని కుమాళ్ల ప్రత్యక్షత కొర
౨౦ కు కనిపెట్టుతున్నది యెందుకంటే ఆ సృష్టిన్ని
౨౧ క్షయస్థితియొక్క దాస్యమునుంచి విడిపించబడి
దేవుని పిల్లలయొక్క మహిమగల విడుదల పొందు
నసే నిరీక్షణతో సృష్టి స్వేచ్ఛవల్ల కాక దాని లో
౨౨ పరిచిన వాని వల్లనే వ్యర్థతకు లోపరచబడెను‡
యెందుకంటే సమస్త సృష్టిన్ని యిదివరకు యేక
ముగా మూలుగుతున్న ప్రసవ వేదనపడుతున్న
౨౩ వున్నదని యెరుగుదుము. అంతే కాకుండా మనము
ఆత్మయొక్క ప్రథమార్థములు పొందినప్పటికిన్ని
మనము కూడా మన శరీరముయొక్క విమోచన
మనే కుమారస్థితి కొరకు కనిపెట్టుతూ మనలో
౨౪ మనము మూలుగుతున్నాము యెందుకంటే మనము
నిరీక్షణ వల్ల రక్షించబడితిమి అయితే కనుబడే
నిరీక్షణ నిరీక్షణ కాదు యెందుకంటే యెవడైనా
చూస్తున్నదాని కొరకు యికను యేల నిరీక్షించును.
౨౫ అయితే మనకు కనుబడని దానికొరకు నిరీక్షించి
నట్టయితే దానికొరకు వోపికతో కనిపెట్టుదుము.
౨౬ ఆ ప్రకారము ఆత్మయున్ను మన బలహీనతలకు
అతిసహాయము చేస్తున్నది యేలాగంటే మనము
తగిన ప్రకారము దేని కొరకు ప్రార్థించ వలెనో
యెరుగము అయితే వుచ్చరించబడని మూలుగులతో
ఆ యాత్మయే మన కొరకు విజ్ఞాపనము చేస్తున్నది.
అయితే హృదయములను పరిశోధించే వాడు ఆత్మ ౨౭
యొక్క మనస్సు యేమిటో అది యెరుగును యెం
దుకంటే దేవుని (చిత్త) ప్రకారము పరిశుద్ధుల కొ
రకు విజ్ఞాపనము చేసును.

మరిన్ని దేవునియందు ప్రేమ వుంచే వారికి— ౨౮
అనగా ఆయన సంకల్పము చొప్పున పిలువబడిన
వారికి మేలు కొరకు సమస్తమున్ను సమకూడి జరు
గునని యెరుగుదుము యెందుకంటే ఆయన యెవ ౨౯
రిని ముందుగా యెరిగి యుండెనో తన కుమా
రుడు అనేక సహోదరులలో జ్యేష్ఠుడయే కొరకు
వారిని ఆయన పోలికెతో సమ రూపముగల వార
వుటకు ముందుగా నిర్ణయించుకొనెను. మరిన్ని ౩౦
ఆయన యెవరిని ముందుగా నిర్ణయించుకొనెనో
వారిని పిలిచెను యెవరిని పిలిచెనో వారిని నీతి
మంతులని తీర్చెను యెవరిని నీతి మంతులని తీర్చె
నో వారిని మహిమ పరిచెను.

కాబట్టి వీటి విషయమై యేమి చెప్పుదము. ౩౧
దేవుడు మన పక్షమై యుంటే మనకు విరోధి
యెవడు. తన స్వకీయమైన కుమారుడని వెనుక ౩౨
తియ్యక మన యందరి కొరకు ఆయనను అప్పగిం
చిన వాడు ఆయనతో కూడా సమస్తమున్ను మనకు
యెందుకు అనుగ్రహించడు. దేవుని చేత యేర్ప ౩౩
రచబడిన వారి మీద నేరము మోపే వాడు యెవడు
నీతిమంతులని తీర్చే వాడు దేవుడే. శిక్ష విధించే ౩౪
వాడు యెవడు చనిపోయిన వాడు క్రీస్తే—అంతే
కాకుండా ఆయన లేపబడి దేవుని కుడి పార్శ్వ
మందు వుండి మన కొరకు విజ్ఞాపనము చేస్తున్నాడు.
క్రీస్తుయొక్క ప్రేమనుంచి మనలను యెడబాపే ౩౫
వాడు యెవడు—మేము నీ నిమిత్తము దినమంతా ౩౬
మరణము పొందుతూ వున్నాము వేట గొర్రెల వలె
యెంచబడుతున్నామని వ్రాయబడిన ప్రకారము
(జరిగినప్పటికీ) శ్రమయైనా బాధయైనా హింస
యైనా కరువైనా వస్త్రహీనతయైనా వుపద్రవ
మైనా ఖడ్గమైనా యెడబాపునా. అయితే మన ౩౭
యందు ప్రేమ వుంచిన వాని ద్వారా మనము

* లేక, లో. † లేక, మనలో.

‡ లేక, సృష్టి స్వేచ్ఛవల్ల కాక దాని లో పరిచిన వానివల్లనే వ్యర్థతకు లోపరచ బడెను గనుక ఆ సృష్టిన్ని క్షయస్థితి దాసత్వమునుంచి దేవుని పిల్లల మహిమయొక్క విడుదలలోకి విడిపించబడునసే నిరీక్షణతో సృష్టి తేరి పారచూస్తూ దేవుని కుమాళ్ల ప్రత్యక్షత కొరకు కనిపెట్టుతున్నది.

వీటి అన్నిటిలోనున్ను అతివిజయము పొందుతు
౩౮ న్నాము యెందుకంటే మరణమైనా జీవమైనా
దూతలైనా ప్రధానులైనా అధికారులయినా వున్న
వైనా వుండబోయేవైనా యెత్తయినా లోతైనా
౩౯ మరి యే సృష్టియైనా మన ప్రభువైన యేసు క్రీస్తు
లో వున్న దేవుని ప్రేమనుంచి మనలను యెడ
బాప నేరవని రూఢిగా నమ్ముకొంటున్నాను.

## ౯ పర్వము.

౧-౩ నేను క్రీస్తు యందు నిజము చెప్పుతున్నాను
అబద్ధమాడను పరిశుద్ధాత్మ యందు నా మనస్సాక్షి
కూడా నాకు బహు దుఃఖమున్ను నా హృదయ
ములో మానని బాధయున్ను వున్నవని నా కొరకు
సాక్ష్యమిస్తున్నది యేలాగంటే మాంసప్రకారము
గా నాకు బంధువులైన నా సహోదరుల కొరకు
౪ నేను కూడా క్రీస్తు యొద్ద నుంచి* శాపగ్రస్తుడ
నవుటకు కోరియుందును.† వీరు ఇశ్రాయేలీయులై
యున్నారు. కుమారస్థితియున్ను మహిమయున్ను
నిబంధనలున్ను ఆజ్ఞాప్రమాణ దానమున్ను అర్చన
౫ యున్ను వాగ్దత్తములున్ను వీరివై యున్నవి. పితృ
లు వీరి వారు. మాంసవిషయమై క్రీస్తు వీరిలో
పుట్టెను. ఈయన యెప్పుడున్ను స్తుతి పొంద తగిన
సర్వోన్నతుడైన దేవుడై యున్నాడు. ఆమేన్.
౬ అయితే దేవుని మాట తప్పిపోయినట్టు కాదు
యెందుకంటే ఇశ్రాయేలులో అందరు ఇశ్రాయేలు
౭ కారు. మరిన్ని అబ్రాహాముయొక్క సంతానమై
నందున అందరున్ను పిల్లలు కారు గాని—ఈసాకు
౮ లో నీ సంతానము పిలువబడును అనగా మాంసపు
పిల్లలు దేవుని పిల్లలు కారు గాని ఆ వాగ్దత్తపు
౯ పిల్లలు సంతానముగా యెంచబడుదురు యెందుకం
టే—ఈ కాల ప్రకారము నేను వస్తాను అప్పుడు
సర్రా కుమారుని కనునని వాక్యము దత్తమైనది.
౧౦ అంతే కాకుండా రెబెక్క ఈసాకనే మన తండ్రి
౧౧ యైన వొకనివల్ల గర్భము ధరించుకొన్నప్పుడు మరి
న్ని ఆ పిల్లలు పుట్టి మేలైనా కీడైనా చేయక ము
నుపే యేర్పాటు ప్రకారము దేవుని సంకల్పము
క్రియలవల్ల కాక పిలిచే వానివల్లనై నిలకడగా
౧౨ వుండే కొరకు ఆమెతో—అన్న తమ్ముని సేవించునని
చెప్పబడెను. ఆ ప్రకారమే—నేను యాకోబును
ప్రేమించి ఏశావు యందు ద్వేషించి యున్నానని ౧౩
వ్రాయబడి యున్నది.

కాబట్టి మనము యేమందము దేవునియందు ౧౪
అన్యాయము కలదా. ఆ వూహ కూడదు యెందు ౧౫
కంటే ఆయన—నేను యెవని యందు కృప చేతునో
వాని యందే కృప చేతును నేను కరుణించే వాని
కరుణింతునని మోశేతో చెప్పుతున్నాడు. కాబట్టి ౧౬
యిచ్ఛయించే వానివల్లనైనా పరుగెత్తే వానివల్ల
నైనా కాదు గాని కృప చేసే దేవునివల్లనవును
యెందుకంటే లేఖనము ఫరావుతో—నేను నీ యం ౧౭
దు నా బలము కనుపరచుటకున్ను నా నామము
భూమియందంతటా తెలియబడుటకున్ను యిందు
నిమిత్తమే నిన్ను నిలువబెట్టి‡ యున్నానని చెప్పు
తున్నది. కాబట్టి తన మనస్సు చొప్పున వొకని ౧౮
కనికరించి తన మనస్సు చొప్పున వొకని కఠిన
పరచును.

కాబట్టి—ఆయన యింకా నేరము యెందుకు ౧౯
మోపును యెందుకంటే ఆయన చిత్తమునకు యెవడు
యెదిరించునని నాతో చెప్పుదువు. అవును గాని ౨౦
ఓ మనుష్యుడా దేవునికి విరోధముగా ప్రత్యుత్తర
మిచ్చే నీవు యెవడవు. నన్ను యీలాగు యెం
దుకు చేసితివని నిర్మితమైనది నిర్మించినవానితో
చెప్పునా. వొక్క ముద్దలోనుంచి వొక ఘటము ౨౧
ఘనము కొరకున్ను వొకటి ఘనహీనత కొరకున్ను
చేసుటకు కుమ్మరవానికి మంటి మీద అధికారము
లేదా ఆలాగు దేవుడు తన వుగ్రతను అగుపరచు ౨౨
టకున్ను తన బలము తెలుపుటకున్ను యిచ్ఛయించి
నాశనమునకు సిద్ధపడిన వుగ్రత ఘటములను బహు
దీర్ఘశాంతము చేత సహించినట్టయితే యేమి.
ఆయన తాను మహిమకొరకు ముందు సిద్ధపరిచిన ౨౩
కృపా ఘటముల యెడల తన మహిమయొక్క ఐశ్వ
ర్యము తెలియచేయ వలెనని యుంటే యేమి.
వీరిలో మనలనున్ను యూదులలోనుంచి మాత్రమే ౨౪
కాకుండా అన్యజనులలోనుంచిన్ని ఆయన పిలి
చెను. ఆ ప్రకారమే—నా ప్రజలు కాని వారిని ౨౫
నా ప్రజలనిన్ని ప్రియురాలు కాని దానిని ప్రియు
రాలనిన్ని పిలుతును. అప్పుడు జరిగేది యేమంటే ౨౬
మీరు నా ప్రజలు కారని యే చోటను వారితో
చెప్పబడెనో అక్కడ జీవముగల దేవుని పిల్లలని

---

* లేక, వల్ల. † లేక, నేను కూడా క్రీస్తు యొద్దనుంచి శాపగ్రస్తుడనౌటకు కోరియుంటిని గనుక మాంస ప్రకారముగా నాకు బంధువులైన సహోదరుల కొరకు నాకు బహు దుఃఖమున్ను నా హృదయములో మానని బాధయున్ను వున్నవని నా మనస్సాక్షి కూడా నా కొరకు సాక్ష్యమిస్తున్నది. ‡ లేక, లేపి.

పిలువబడుదురని హోషేయలోనున్ను పలుకుతు
న్నాడు.
౨౭ మరిన్ని ఎషయా కూడా—ఇశ్రాయేలు కుమాళ్లు
సముద్రముయొక్క యిసుకవలె విస్తారముగా వున్న
ప్పటికిన్ని శేషమే రక్షించబడును యెందుకంటే
తన మాట కొనసాగించి నీతి యందు దాని నిర్ణ
౨౮ యించును * యెందుకంటే నిర్ణయించ బడిన
మాట దేశము మీద ప్రభువు జరిగించునని ఇశ్రా
యేలును గురించి కంఠమెత్తి చెప్పుతున్నాడు.
౨౯ మరిన్ని ఎషయా ముందుగా చెప్పిన ప్రకారము—
సైన్యములయొక్క ప్రభువు మనకు శేషము విత్తన
ముగా వుండ నివ్వకపోతే సొదొమ వలె యుం
దుము గొమొఱ్ఱను పోలి యుందుము.
౩౦ కాబట్టి మనము యేమందము యేమంటే నీతిని
వెతుకని అన్యజనులు నీతి పొందిరి అయితే అది
౩౧ విశ్వాసమువల్లనైన నీతి. అయితే ఇశ్రాయేలు నీతి
ఆజ్ఞాప్రమాణమును వెతుకుతూ యింకా నీతి ఆజ్ఞా
౩౨ ప్రమాణమును పొందలేదు. యెందుకు. యెందు
కంటే వారు విశ్వాసమువల్ల కాక ఆజ్ఞాప్రమా
ణపు క్రియలవల్లనైనట్టు వెతుకుతూ—ఇదుగో నేను
సీయోనులో ఆతంకపు రాతినిన్ని అడ్డపు బండ
నున్ను వేస్తున్నాను. ఆయన యందు నమ్మికె వుంచే
వాడెవడున్ను అవమానపరచబడడని వ్రాయబడిన
ప్రకారము వారు ఆ అభ్యంతరపు రాతిని తగిలిరి.

## ౧౦ పర్వము.

ఓ సహోదరులారా ఇశ్రాయేలు కొరకు నా
హృదయముయొక్క అభిలాషయున్ను దేవుని గూ
ర్చిన నా ప్రార్థనయున్ను వారి రక్షణ కొరకై
౨ యున్నవి యెందుకంటే వారు దేవుని యందు ఆసక్తి
గలవారని వారి కొరకు సాక్ష్యమిస్తున్నాను అయి
౩ తే అది జ్ఞాన ప్రకారమైనది కాదు యెందుకంటే
వారు దేవుని నీతిని యెరుగక తమ స్వనీతిని స్థా
పించుటకు వెతికి దేవుని నీతికి లోబడి యుండ
౪ లేదు యెందుకంటే నమ్మే ప్రతివానికిన్ని నీతి కలు
గుటకు క్రీస్తు ఆజ్ఞాప్రమాణముయొక్క అంతమై
యున్నాడు.
౫ ఎందుకంటే మోశే—వీటిని చేసే మనుష్యుడు
వీటివల్ల జీవించునని ఆజ్ఞాప్రమాణము వల్లనైన నీతిని
౬ గూర్చి వ్రాస్తున్నాడు. అయితే విశ్వాసము వల్ల
నైన నీతి యీలాగు చెప్పుతున్నది—యెవడు ఆకా
శమునకు యెక్కి వెళ్లును అనగా క్రీస్తును కిందికి
తెచ్చుటకు. లేక—యెవడు అగాధములోకి దిగి ౭
వెళ్లును అనగా క్రీస్తును చనిపోయిన వారిలోనుంచి
మీదికి తెచ్చుటకు అని నీ హృదయములో అను
కొనవద్దు. అయితే అది యేమి చెప్పుతున్నది— ౮
వాక్యము నీకు సమీపమై నీ నోటిలోనున్ను నీ
హృదయములోనున్ను వున్నది అనగా మేము ప్రక ౯
టించే విశ్వాస వాక్యము. అదేమంటే నీ నోటి
తో యేసు ప్రభువని వొప్పుకొని దేవుడు ఆయనను
చనిపోయిన వారిలోనుంచి లేపినాడని నీ హృద
యముతో నమ్మినట్టయితే రక్షించబడుదువు యెందు ౧౦
కంటే నీతి నిమిత్తము హృదయముతో నమ్మబడును
రక్షణ నిమిత్తము నోటితో వొప్పుకొన బడును
యెందుకంటే—ఆయన యందు నమ్మికె వుంచే వాడె ౧౧
వ్వడున్ను సిగ్గుపరచబడడని లేఖనము చెప్పుతున్నది
యెందుకంటే యూదునికిన్ని హెల్లేనీయునికిన్ని ౧౨
భేదము లేదు యెందుకంటే అందరి ప్రభువైన
వొక్కడే తన్ను ప్రార్థించే వారందరి యెడల
ఐశ్వర్యవంతుడై యున్నాడు యెందుకంటే—ప్రభు ౧౩
యొక్క నామము పట్టి ప్రార్థించే వాడెవడో
వాడు రక్షించబడును.
కాబట్టి వారు నమ్మని వాని యేలాగు ప్రార్థిం ౧౪
తురు. వారు వినని వాని యేలాగు నమ్ముదురు.
ప్రకటించే వాడు లేకుంటే యేలాగు విందురు.
వారు పంపబడకపోతే యేలాగు ప్రకటింతురు. ఆ ౧౫
ప్రకారము—సమాధాన సువార్తను ప్రకటించి
మంచి వాటి సువార్తను ప్రకటించే వారి పాద
ములు యెంత చక్కనివై యున్నవని వ్రాయబడి
యున్నది.
అయినప్పటికిన్ని అందరు ఆ సువార్తకు విధే ౧౬
యులు కాలేదు యెందుకంటే ఎషయా—ఓ ప్రభు
వా మేము వినిపించినది యెవడు నమ్మెనని చెప్పు
తున్నాడు. కాబట్టి విశ్వాసము వినిపించుటవల్ల ౧౭
నున్ను వినిపించుట దేవుని మాటవల్లనున్ను కలు
గును. అయితే నేను చెప్పేది యేమంటే వారు
విన లేదా. అవును—వారి శబ్దము భూమియం ౧౮
తటానున్ను వారి మాటలు భూమి అంతముల మట్టు
కున్ను బయిలు వెళ్లెను.
మరిన్ని నేను చెప్పేది యేమంటే యిది ఇశ్రా ౧౯
యేలుకు తెలియ లేదా. మొదట మోశే—నేను
జనము కాని వారివల్ల మీకు ఆసక్తి కలుగ చేతును.
అవివేక ప్రజలవల్ల మీకు కోపము తెప్పింతునని
చెప్పుతున్నాడు. అయితే ఎషయా ధైర్యపడి— ౨౦

* లేక, సంక్షేపించును.

నేను నన్ను వెతకని వారికి దొరికితిని నన్ను గురించి
విచారించని వారికి ప్రత్యక్షుడనై యున్నానని
౨౧ చెప్పుతున్నాడు. అయితే ఆయన ఇశ్రాయేలును
గూర్చి—అవిధేయులైనటువంటిన్ని యెదురాడేటటు
వంటిన్ని ప్రజలకు నేను రోజల్లా నా చేతులు
చాపితినని చెప్పుతున్నాడు.

## ౧౧ పర్వము.

ఆలాగైతే నేను చెప్పేది యేమంటే—దేవుడు
తన ప్రజలను విసర్జించెనా. ఆ వూహ కూడదు
యెందుకంటే నేనున్ను అబ్రాహాము సంతతిలో
నున్ను బెన్యామీను గోత్రములోనున్ను ఇశ్రాయే
౨ లీయుడనై యున్నాను. దేవుడు తాను మునుపు
యెరిగిన తన ప్రజలను విసర్జించ లేదు. లేఖ
నము ఏలీయాలో యేమి చెప్పుతున్నదో మీరు
౩ యెరగరా యేలాగంటే—ఓ ప్రభువా నీ ప్రవక్త
లను చంపిరి నీ బలిపీఠములను విరగదీసిరి నేను
వొక్కడనే మిగిలితిని వారు నా ప్రాణము వెతుకు
తున్నారని ఆయన ఇశ్రాయేలీయులకు విరోధము
౪ గా దేవునితో విజ్ఞాపనము చేస్తున్నాడు. అయితే
దేవోక్తి ఆయనతో యేమి చెప్పుతున్నది—బాయ
లకు మోకాళ్లు వంచని యేడు వేల మనుష్యులను
౫ మిగిలించుకొని యున్నాననేది. కాబట్టి ఆలాగు
యిప్పటి కాలమందున్ను కృపయొక్క యేర్పాటు
౬ చొప్పున శేషము మిగిలి యున్నది. మరిన్ని అది
కృపచేతనైతే యికను క్రియలవల్ల కాదు * లేక
పోతే కృప యికను కృప కాదు. అయితే
క్రియల వల్లనైతే † యికను కృపకాదు లేకపోతే
క్రియ యికను క్రియ కాదు.
౭ ఆలాగైతే యేమి—ఇశ్రాయేలు దేని వెతుకు
౮ తున్నాడో అది వానికి దొరకలేదు అయితే యే
ర్పాటైన వారికి దొరికెను. తక్కిన వారు అంధు
లుగా చేయబడిరి. ఆప్రకారము—ఈ నేటి దిన
ము వట్టుకు దేవుడు వారికి గాఢనిద్రగల ఆత్మను
న్ను చూడని కన్నులనున్ను వినని చెవులనున్ను
౯ యిచ్చి యున్నాడని వ్రాయబడి యున్నది. మ
రిన్ని దావీదు—వారి భోజనపు బల్ల వారికి బోను
గానున్ను చిక్కువలగానున్ను అభ్యంతరముగాను
౧౦ న్ను ప్రతిఫలముగానున్ను వుండునుగాక. వారు
చూడనట్టు వారి కన్నులకు చీకటి చేయబడును
గాక. వారి వీపును నిత్యమున్ను వంచుమని
చెప్పుతున్నాడు.

కాబట్టి నేను చెప్పేదేమంటే వారు పడే కొరకు ౧౧
అడ్డము తగిలెనా ఆ వూహ కూడదు. అయితే
వారికి ఆసక్తి‡ పుట్టించే కొరకు వారి తప్పితము§
వల్ల అన్యజనులకు రక్షణ వచ్చెను. అయితే వారి ౧౨
తప్పితము§ లోకముయొక్క భాగ్యమున్ను వారు
తగ్గిపోవుట అన్యజనులయొక్క భాగ్యమున్ను అ
య్యుంటే యెంతో అధికము గదా వారి పరిపూ
ర్ణత. యెందుకంటే నేను అన్యజనులయొక్క ౧౩
అపొస్తలుడనై యున్నాను గనుక అన్యజనులైన ౧౪
మీతో మాట్లాడుతున్నాను యే విధము చేతనైనా
నారక్త|| సంబంధులకు ఆసక్తి ‡ కలుగచేసి వారిలో
కొందరిని రక్షించే నిమిత్తము నా వుద్యోగము ఘన
పరుస్తున్నాను యెందుకంటే వారిని విసర్జించుట ౧౫
లోకమును సమాధానపరచడమైతే వారిని చేర్చు
కొనుట యేమిటి—చనిపోయిన వారిలోనుంచి జీవ
ము కాదా.

మరిన్ని మొదటి పంట పరిశుద్ధమైనదైతే ఆ ౧౬
ముద్దయున్ను వేరు పరిశుద్ధమైతే కొమ్మలున్ను ఆలా
టివే. అయితే ఆ కొమ్మలలో కొన్ని విరవబడిన ౧౭
ప్పుడు అడవి ఒలీవ చెట్టుగా వున్న నీవు వాటిలో
అంటు కట్టబడి వాటితో ఒలీవ చెట్టుయొక్క
వేరులోనున్ను రసములోనున్ను పాలు పొందినట్ట
యితే ఆ కొమ్మలకు విరోధముగా వుత్సహించకు ౧౮
ము. నీవు వుత్సహించినట్టయితే నీవు వేరును
కాదు గాని వేరు నిన్ను భరిస్తున్నది. కాబట్టి— ౧౯
నేను అంటుకట్టబడే కొరకు ఆ కొమ్మలు విరువ
బడెనని చెప్పుదువు. అవి అవిశ్వాసమువల్ల విరు ౨౦
వబడెను. నీవు విశ్వాసమువల్ల నిలిచి యున్నావు.
గర్వించక భయపడుము యెందుకంటే దేవుడు ౨౧
సహజమైన కొమ్మలను విడువక పోతే వొక వేళ
నిన్ను కూడా విడువడేమో.

కాబట్టి దేవుని దయనున్ను కాఠిన్యమున్ను ౨౨
చూడు—పడిన వారి మీద కాఠిన్యమున్ను నీవు ఆ
దయలో నిలిచి యుంటే నీ మీద దయయున్ను—
లేకపోతే నీవున్ను నరికివేయబడుదువు. వారు ౨౩
న్ను అవిశ్వాసములో నిలువకపోతే అంటుకట్టబ
డుదురు యెందుకంటే దేవుడు వారిని మళ్లీ అంటు
కట్టుటకు శక్తిగల వాడు యెందుకంటే నీవు స్వభా ౨౪
వమువల్ల అడవిదైన ఒలీవ చెట్టునుంచి కోయబడి
స్వభావ విరోధముగా ఆ మంచి ఒలీవ చెట్టున
అంటుకట్టబడినట్టయితే స్వాభావికమైన వీరు మరి

* లేక, పని జీతముకాదు. † లేక, పని జీతమైతే. ‡ లేక, అత్యాశ.
§ లేక, వారు తప్పిపోవుట. || గ్రేకులో, మాంసము.

యెంత నిశ్చయముగా తమ స్వంతమైన ఒలీవ
చెట్టున అంటుకట్టబడుదురు.
౨౫ ఎందుకంటే సహోదరులారా మీ దృష్టికి
మీరే బుద్ధిమంతులై యుండనట్టు మీరు యీ మ
ర్మము యెరగక వుండుటకు నాకు మనస్సు లేదు
యేమంటే అన్యజనుల పరిపూర్ణత చేరే పర్యంత
మున్ను అంధత్వము* ఇశ్రాయేలుకు కొంత మట్టు
౨౬ కు సంభవించెను. అప్పుడు—వుద్ధారకుడు సీయో
నులోనుంచి వచ్చి యాకోబుయొద్దనుంచి భక్తిహీన
౨౭ తను నివారణ చేసును. మరిన్ని నేను వారి పా
పములను పరిహరించినప్పుడు నాతో వారికి కలిగే
నిబంధన యిదే అని వ్రాయబడిన ప్రకారము
౨౮ ఇస్రాయేలంతా యీలాగు రక్షించబడును. సు
వార్త విషయమై వారు మీ నిమిత్తము శత్రువులై
యున్నారు అయితే యేర్పాటు విషయమై పితృల
౨౯ నిమిత్తము ప్రియులై యున్నారు యెందుకంటే
దేవుని కృపావరములున్ను ఆయన పిలుపున్ను తిరిగీ
30 పుచ్చుకొనబడవు యెందుకంటే మీరున్ను వొక
ప్పుడు దేవునికి అవిధేయులై యిప్పుడు వీరి అవి
3౧ ధేయతవల్ల యేలాగు కరుణించబడితిరో ఆలాగే
వారున్ను కరుణించబడే కొరకు మీ కరుణవల్ల వా
3౨ రున్ను యిప్పుడు అవిధేయులై యున్నారు యెం
దుకంటే దేవుడు అందరి యందు కరుణించే కొరకు
అందరినిన్ని అవిధేయతలో మూసి యున్నాడు.
33 ఓహో దేవుని బుద్ధి జ్ఞానముల ఐశ్వర్యము
యొక్క లోతు! ఆయన న్యాయపు తీర్పులు యెం
తో అగోచరముగా వున్నవి! ఆయన మార్గములు
3౪ తరుచుటకు అశక్యముగా వున్నవి యెందుకంటే
ప్రభువుయొక్క మనస్సును యెరిగిన వాడు యెవ
3౫ డు ఆయనకు ఆలోచనకర్త యెవడు. ఆయనకు
ముందుగా యిచ్చి ప్రతిఫలము పొందేవాడు యె
3౬ వడు యెందుకంటే ఆయన వల్లనున్ను ఆయన
ద్వారానున్ను ఆయన నిమిత్తమున్ను సమస్తమున్ను
వున్నది—ఆయనకు యెప్పటికిన్ని మహిమ కలుగు
నుగాక. ఆమేన్.

## ౧౨ పర్వము.

కాబట్టి సహోదరులారా మీ శరీరములను
పరిశుద్ధమైనటువంటివిన్ని దేవునికి అనుకూలమైనటు
వంటివిన్ని జీవము గల బలిగా సమర్పించ వలె
నని మిమ్మును దేవుని వాత్సల్యమువల్ల బతిమాలుకొం
౨ టున్నాను—అదే మీ వివేకమైన ఆరాధన. ఈ
లోక మర్యాదను అనుసరించక మంచిదిన్ని అను
కూలమైనదిన్ని పరిపూర్ణమైనదిన్నైనది యేదో ఆ
దేవుని యిష్టమును పరీక్షించే కొరకు మీ మనస్సు
నూతనపడుటవల్ల రూపాంతరులై యుండండి.
ఎందుకంటే (తన్ను) యెంచుకొన తగిన దాని 3
కంటే యెక్కువగా యెంచుకొనక దేవుడు వొ
క్కొక్కనికి విశ్వాస విభాగము విభాగించిన ప్ర
కారము స్వస్థబుద్ధి కలుగుటకు యెంచుకొన వలె
నని నాకు యివ్వబడిన కృపవల్ల మీలో వున్న
ప్రతి మనుష్యునితోనున్ను చెప్పుతున్నాను యెం ౪
దుకంటే వొక్క శరీరములో మనకు అనేకమైన
అవయవములు వుండిన్ని ఆ యవయవములన్నిటి
కిన్ని వొక్కటే పని యేలాగు వుండదో ఆలాగే ౫
అనేకులమైన మనము క్రీస్తులో యేక శరీరముగా
వుండి వొకనికి వొకడు అవయవములమై యున్నా
ము. అయితే మనకు యివ్వబడిన కృపచొప్పున ౬
భేదముగా వున్న వరములు పొంది యున్నాము.
ప్రవచన వరమైతే విశ్వాస పరిమాణము చొప్పున ౭
నున్ను సేవయైతే సేవలోనున్ను వుపదేశకుడైతే వుప ౮
దేశములోనున్ను బోధకుడైతే బోధలోనున్ను ధర్మ
ము† చేసే వాడైతే నిష్కపటముతోనున్ను అధికా
రియైతే జాగ్రతతోనున్ను కరుణించేవాడైతే సం
తోషముతోనున్ను వుండ వలెను.
ప్రేమ నిష్కపటముగా వుండనియ్యు చెడ్డదాని ౯
యందు అసహ్యపడి మంచిదాని అత్తి యుం
డండి. సహోదర ప్రేమతో వొకని యందు ౧౦
వొకడు వాత్సల్యము గలవారై ఘనత యందు వొ
కనికంటే వొకని హెచ్చించండి. కదలిక యందు ౧౧
మందులు కాక ఆత్మ యందు తీవరపడి ప్రభువును
సేవించండి. నిరీక్షణ యందు సంతోషిస్తూ శ్రమ ౧౨
యందు నిశ్చలులై యుంటూ ప్రార్థన యందు నిల
కడగా వుండండి. పరిశుద్ధుల అవసరముల యందు ౧౩
సహాయము చేస్తూ ఆతిథ్యము శ్రద్ధగా చేయండి.
మిమ్మును హింసపరిచే వారిని దీవించండి—దీవిం ౧౪
చండిగాని శపించకండి. సంతోషించే వారితో ౧౫
సంతోషించండి యేడ్చేవారితో యేడ్వండి. వొ ౧౬
కని యెడల వొకడు యేకమనస్కులై యుండండి.
గొప్ప వాటి యందు మనస్కరించక దీనులతో
పొందు చేయండి.‡ మీకు మీరే బుద్ధిమంతులమని
అనుకొన వద్దు. కీడుకు ప్రతికీడు యెవనికిన్ని ౧౭
చేయవద్దు. మనుష్యులందరి దృష్టికి యోగ్యమైన
వాటిని గూర్చి ముందుగా సిద్ధపడండి. శక్య ౧౮
మైతే సమస్త మనుష్యులతో మీవల్లనైనంత మట్టుకు

* లేక, కాఠిన్యము. † లేక, పంచిపెట్టే. ‡ గ్రేకులో, కొంచుపోబడండి.

౧౯ సమాధానముగా వుండండి. ప్రియులారా మీకు
మీరే న్యాయము తీర్చుకొనక వుగ్రతకు స్థలమి
వ్వండి యెందుకంటే—న్యాయము తీర్చుట నాదే
నేను ప్రతిఫలము యిత్తునని ప్రభువు చెప్పుతున్నా
౨౦ డని వ్రాయబడియున్నది. కాబట్టి—నీ శత్రువు
ఆకలిగొన్నట్టయితే అతనికి ఆహారము పెట్టుము.
అతడు దప్పిగొన్నట్టయితే అతనికి దాహమిమ్ము
యెందుకంటే యీలాగు చేసి అతని తల మీద
నిప్పుల కుప్ప వేతువు. కీడువల్ల జయించబడక
కీడును మేలువల్ల జయించుము.

## ౧౩ పర్వము.

ప్రతి మనుష్యుడున్ను* పై అధికారులకు లో
బడ వలెను యెందుకంటే దేవుని వల్లనేగాని యే
అధికారమున్ను లేదు. వున్న అధికారములు దేవు
౨ నిచేత నియమించబడి యున్నవి. కాబట్టి ఆ
యధికారముకు యెదిరించే వాడు దేవుని నియ
మమునకు యెదిరిస్తున్నాడు యెదిరించేవారు తమకు
౩ శిక్షావిధిని తెచ్చుకొందురు యెందుకంటే యేలే
వారు చెడ్డ కార్యములకేగాని మంచి కార్యములకు
భయంకరులు కారు. నీవు యీ అధికారమునకు
భయపడక వుండ కోరితివా మంచిదాని చేయుము
౪ అప్పుడు దానివల్ల మెప్పు పొందుదువు యెందుకం
టే నీ మేలు కొరకు ఆయన దేవుని సేవకుడై యు
న్నాడు. అయితే నీవు చెడ్డదాని చేస్తే భయప
డుము యెందుకంటే ఆయన ఖడ్గమును వూరికె
వహించడు. యెందుకంటే ఆయన దేవుని సేవకుడు
న్ను చెడ్డదాని చేసే వానికి శిక్షావిధి† కొరకు న్యా
యముతీర్చే వాడున్నై యున్నాడు.
౫ కాబట్టి శిక్షాభయమువల్ల† మాత్రమే కాకుండా
మనస్సాక్షి వల్లనున్ను మీరు అగత్యముగా లోబడి
౬ యుండవలెను యెందుకంటే యిందువల్ల మీరు
పన్ను కూడా యిస్తున్నారు యెందుకంటే వారు
దేవుని సేవకులై యుండి యెప్పుడున్ను దీని నిమి
౭ త్తమే పని చేస్తున్నారు. కాబట్టి యెవనికి పన్నో
వానికి పన్నున్ను యెవనికి సుంకమో వానికి సుం
కమున్ను యెవనికి భయమో వానికి భయమున్ను
యెవనికి ఘనమో వానికి ఘనమున్ను యిచ్చి అంద
౮ రికిన్ని వారివారి ఋణములను తీర్చండి. వొకని
వొకడు ప్రేమించుట గాక మరి యేమిన్ని యెవని
కిన్ని అచ్చి యుండ వద్దు యెందుకంటే అన్యుని
ప్రేమించే వాడు ఆజ్ఞాప్రమాణము నెరవేర్చియు
౯ న్నాడు యెందుకంటే—వ్యభిచరించ వద్దు నరహత్య
చేయవద్దు దొంగిల వద్దు అబద్ధపు సాక్ష్యమివ్వ
వద్దు ఆశించ వద్దు అనేదిన్ని మరి యే ఆజ్ఞయైనా
వుంటే అదిన్ని—నీ వలె నీ పొరుగు వాని ప్రే
మించ వలెననే మాటలో సంక్షేపముగా యిమిడి
యున్నవి. ప్రేమ పొరుగువానికి హాని చేయదు ౧౦
గనుక ప్రేమ ఆజ్ఞాప్రమాణముయొక్క సంపూ
ర్ణమై యున్నది.
మరిన్ని మనము నిద్ర మేలుకొనే వేళ అయిన ౧౧
దని సమయమును తెలుసుకొని ఆలాగు (చేయండి)
యెందుకంటే మనము నమ్మినప్పటికంటే మన రక్షణ
యిప్పుడు సమీపముగా వున్నది. చాలా రాత్రి ౧౨
గడిచి పగలు సమీపించెను. అందు చేతను మన
ము చీకటి పనులు వదులుకొని వెలుగుయొక్క
ఆయుధములను ధరించుకొందము. సందడియైనా ౧౩
మత్తయినా లేకనున్ను కామవిలాసములైనా పోకిరి
తనములైనా లేకనున్ను జగడమైనా మత్సరమైనా
లేకనున్ను పగటి యందు వున్నట్టు యుక్తముగా
నడుచు కొందము. అయితే మీరు ప్రభువైన ౧౪
యేసు క్రీస్తును ధరించుకొని మాంసమును గూర్చి
దాని ఆశలకొరకు ముందు విచారించుకొనకండి.

## ౧౪ పర్వము.

విశ్వాసమందు బలము లేనివాని చేర్చుకొనండి ౧
అయితే తలంపుల విషయమై తీర్పు చేయుటకు
కాదు యెందుకంటే వొకడు సమస్తమున్ను తిన ౨
వచ్చునని నమ్ముతున్నాడు అయితే బలహీనుడు కూర
లనే తినును. తినేవాడు తినని వాని కొద్దిపరచ ౩
కూడదు. తిననివాడు తినేవానికి తీర్పు చేయ ‡
కూడదు యెందుకంటే దేవుడు అతని చేర్చుకొనెను.
అన్యుని సేవకునికి తీర్పుచేయుటకు నీవు యెవడవు. ౪
అతడు తన స్వంత యజమానుని కొరకు§ నిలుచును
లేక పడును. అయితే అతడు నిలుచును యెందు
కంటే దేవుడు అతని నిలువబెట్టుటకు శక్తి గలవాడు.
వొకడు వొక దినము కంటే మరియొక దినమును ౫
గొప్పగా యెంచును. మరియొకడు ప్రతి దిన
మున్ను (వొక్కలాగే) యెంచును. ప్రతివాడున్ను
తన స్వంత మనస్సులో రూఢిపరుచుకొన వలెను.
దినమును లక్ష్యపెట్టేవాడు ప్రభువు కొరకు దాని ౬
లక్ష్యపెట్టును. దినమును లక్ష్యపెట్టని వాడు
ప్రభువు కొరకు దాని నిర్లక్ష్యపెట్టును. తినేవాడు
ప్రభువు కొరకు తినును యెందుకంటే అతడు
దేవుని స్తుతించును తినని వాడు ప్రభువు కొరకు
తినక మాని దేవుని స్తుతించును యెందుకంటే మన ౭

* గ్రేకులో, జీవము. † గ్రేకులో, వుగ్రతవల్ల. ‡ లేక, దోషియని యెంచ. § లేక, విషయమై.

౭ లో యెవడున్ను తన కొరకు జీవించడు—యెవ్వ
డున్ను తన కొరకు చావడు యెందుకంటే మనము
జీవించినా ప్రభువు కొరకే జీవింతుము చనిపో
యినా ప్రభువు కొరకే చనిపోదుము. కాబట్టి
మనము జీవించినా చనిపోయినా ప్రభువు వారమై
౯ యున్నాము యెందుకంటే క్రీస్తు చనిపోయిన వారి
కిన్ని జీవించిన వారికిన్ని ప్రభువై యుండుటకు
యిందు నిమిత్తము చనిపోయి లేచి తిరిగీ జీవించెను.
౧౦ అయితే నీవు యెందుకు నీ సహోదరునికి తీర్పు
చేస్తున్నావు. లేక నీవు యెందుకు నీ సహోద
రుని కొద్దిపరుస్తున్నావు యెందుకంటే మనమంద
రమున్ను క్రీస్తుయొక్క న్యాయపీఠము యెదుట
౧౧ నిలువ వలెను యెందుకంటే—ప్రతి మోకాలున్ను
నాకు వంగును ప్రతి నాలుకయున్ను దేవునికి
వొప్పుకొనును నా జీవము తోడే అని ప్రభువు
౧౨ చెప్పుతున్నాడని వ్రాయబడి యున్నది గనుక మన
లో ప్రతివాడున్ను తన్ను గురించే దేవునికి ప్రత్యు
త్తరమివ్వ వలెను.
౧౩ కాబట్టి మనము యికమీదట వొకనికి వొకడు
తీర్పు చేయక వుందము అయితే ముఖ్యముగా సహో
దరునికి అభ్యంతరమైనా అడ్డమైనా చేసేది యేది
౧౪ న్ని వేయ కూడదని నిర్ణయించు కొనండి. ఏది
న్ని సహజమువల్ల అపవిత్రము కాదని నేను ప్రభు
వైన యేసువల్ల తెలుసుకొని రూఢిగా నమ్ముతు
న్నాను. అయితే యేదైనా అపవిత్రమని యెంచు
కొనే వానికి అది అపవిత్రమే యెందుకంటే నీ
౧౫ సహోదరుడు నీ భోజనమువల్ల దుఃఖపడినట్టయితే
యిప్పుడు నీవు ప్రేమ చొప్పున నడుచుకొంటు
న్నావు కావు. యెవని కొరకు క్రీస్తు చనిపో
౧౬ యెనో వాని నీ భోజనమువల్ల చెరపవద్దు. కాబట్టి
మీ మేలు దూషించబడనివ్వకండి యెందుకంటే
దేవుని రాజ్యము భోజనమున్ను పానమున్ను కాదు
౧౭ గాని నీతిన్ని సమాధానమున్ను పరిశుద్ధాత్మలో సం
౧౮ తోషమున్ను అయ్యున్నది యెందుకంటే క్రీస్తుకు
లోబడి వీటి యందు సేవ చేసే వాడు దేవునికి
యిష్టుడై మనుష్యుల పరీక్షకు నిలుచును.
౧౯ కాబట్టి సమాధానపు వాటినిన్ని అన్యోన్యమైన
క్షేమాభివృద్ధి కలుగ చేసే వాటినిన్ని అనుసరింతము.
౨౦ భోజనము కొరకు దేవుని కార్యము విరగదియ్య
కండి. అన్ని వస్తువులు శుద్ధిగా వున్నవి. అయి
నప్పటికిన్ని అభ్యంతరము వచ్చేలాగున భుజించే
౨౧ వానికి చెడ్డది. మాంసభోజనమే గానీ ద్రాక్షా
రసపానమే గానీ నీ సహోదరునికి అడ్డమైనా
ఆతంకమైనా బలహీనతయైనా కలుగచేసేది యేదో
అది మాని వేయుట మంచిది. నీకు యీ విశ్వా ౨౨
సము కలదు. సరి అది దేవుని యెదుట నీ నిమి
త్తము కలుగనిమ్ము యెవడు తాను పరీక్షించి తీర్పు
చేసే దాని విషయమై తన్ను దోషిగా యెంచుకొ
నడో వాడు భాగ్యవంతుడు. అయితే అనుమా ౨౩
నించే వాడు తిన్నట్టయితే అది విశ్వాసమూలమైనది
కాదు గనుక అతడు దోషియని తీర్చబడును.
మరిన్ని విశ్వాస మూలము కానిది యేదో అది
పాపమై యున్నది.

## ౧౫ పర్వము.

అయితే బలవంతులమైన మనలను మనమే సం ౧
తోష పరుచుకొనక బలహీనుల దౌర్బల్యములను
సహించ తగును. మనలో ప్రతివాడున్ను క్షేమాభి ౨
వృద్ధి నిమిత్తము మంచి దాని విషయమై తన పొరుగు
వాని సంతోషపరుచుదము యెందుకంటే క్రీస్తు ౩
తన్ను తానే సంతోషపరుచుకొన లేదే అయితే—
నిన్ను నిందించేవారి నిందలు నా మీద పడెనని
వ్రాయబడిన ప్రకారము జరిగెను యెందుకంటే ౪
యేవి పూర్వమందు వ్రాయబడెనో అవి వోర్పు
వల్లనున్ను లేఖనముల సుబోధవల్లనున్ను మనకు నిరీ
క్షణ కలుగుటకు మన వుపదేశము కొరకు వ్రా
యబడెను. మీరు వొక్క మనస్సుతోనున్ను ౫
వొక్క నోటితోనున్ను మన ప్రభువైన యేసు ౬
క్రీస్తుయొక్క తండ్రియైన మన దేవుని మహిమ
పరిచేటందుకు క్రీస్తు యేసు చిత్త ప్రకారము
మీరు వొకనితో వొకడు యేకీభవించేటట్టు వో
ర్పున్ను సుబోధయున్ను యిచ్చే దేవుడు మీకు
దయచేసును గాక. అందుచేతను దేవుని మహిమ ౭
కొరకు క్రీస్తున్ను మనలను చేర్చుకొనిన ప్రకార
ము మీరు వొకని వొకడు చేర్చుకొనండి యెందు ౮
కంటే నేను చెప్పేదేమంటే పితృలకు చేయబడిన
వాగ్దత్తములను స్థిరపరుచుటకున్ను దేవుని సత్యము ౯
కొరకు యేసుక్రీస్తు సున్నతియొక్క సేవకుడై యుం
డెను గాని అన్యజనులు కృప నిమిత్తము దేవుని
మహిమ పరుచుటకున్ను (వచ్చెను.) ఆ ప్రకార
మే—ఇందు నిమిత్తము నిన్ను గూర్చి అన్యజనులలో
వొప్పుకొందును నీ నామమును గూర్చి కీర్తన పా
డుదునని వ్రాయబడి యున్నది. మరిన్ని ఆయన ౧౦
చెప్పుతున్నదేమంటే—ఓ అన్యజనులారా ఆయన
ప్రజలతో ఆనందించండి. మరిన్ని—సమస్తమైన ౧౧
అన్యజనులారా ప్రభువును కొనియాడండి. ఓ
సకల దేశస్థులారా ఆయనను స్తుతించండి. మరి ౧౨
న్ని ఎషయా చెప్పుతున్నాడు—యెస్సైయొక్క
వేరు అనగా అన్యజనులను యేలుటకు లేచేవాడు

పుట్టును ఆయన యందు అన్యజనులు నిరీక్షింతురు.
౧౩ అయితే పరిశుద్ధాత్మయొక్క బలముచేత మీరు నిరీ
క్షణయందు విస్తరించే నిమిత్తము నమ్ముటవల్ల సమస్త
సంతోషముతోనున్ను క్షేమముతోనున్ను నిరీక్షణ
దేవుడు మిమ్మును నింపునుగాక.
౧౪ అయితే నా సహోదరులారా మీరున్ను మం
చితనముతో నిండుకొని సమస్త జ్ఞానము చేత నింప
బడి వొకనికి వొకడు బుద్ధి చెప్పుటకు శక్తి గలవా
రని నేనున్ను మిమ్మును గురించి నమ్ముకొంటున్నా
౧౫ ను. అయినప్పటికిన్ని సహోదరులారా అన్యజ
నులనే సమర్పణ పరిశుద్ధాత్మవల్ల పరిశుద్ధపరచబడి
౧౬ అనుకూలమయే కొరకు నేను దేవుని సువార్త
విషయమై యాజకత్వము జరిగిస్తూ అన్యజనుల
నిమిత్తము యేసు క్రీస్తుయొక్క సేవకుడనై యుండు
టకు దేవునిచేత నాకు యివ్వబడిన కృపవల్ల మీకు
జ్ఞాపకము చేయుటకు కొన్ని చోట్లను యెక్కువగా
౧౭ తెగించి మీకు వ్రాసియున్నాను. కాబట్టి దేవుని
సంబంధమైన వాటి విషయమై యేసు క్రీస్తు యందు
౧౮ వుత్సహించుటకు నాకు కారణముకలదు యెందు
కంటే వాక్యమందున్ను క్రియయందున్ను అన్యజ
౧౯ నుల విధేయత నిమిత్తము గురుతుల బలము వల్లను
న్ను అద్భుతముల బలము వల్లనున్ను పరిశుద్ధాత్మ
బలము వల్లనున్ను క్రీస్తు (నా చేత చేయించిన వా
టినే గాని) నా చేత చేయించకుండిన వాటిలో
దేని గురించిన్ని మాట్లాడ తెగించను. అది గనుక
నేను యెరూశలేము మొదలుకొని ఇల్లురికు పర్యం
తమున్ను చుట్టూవున్న ప్రాంతముల యందు క్రీస్తు
౨౦ సువార్త ప్రకటన నెరవేర్చితిని. అయితే నేను
మరియొకని పునాది మీద కట్టక వుండే కొరకు
౨౧ క్రీస్తు నామము తెలియబడిన చోట్లను కాదు అయి
తే—ఆయనను గురించి యెవరికి సమాచారము
చెప్పబడ లేదో వారు చూతురు వినని వారు
గ్రహించుకొందురని వ్రాయబడినప్రకారము సు
వార్తను ప్రకటించుటకు ఆసక్తితో ప్రయత్నము
చేసి యున్నాను.
౨౨ ఈ హేతువు చేతను నేను మీ యొద్దికి రాకుం
డా అనేక పర్యాయములు ఆతంకపరచబడితిని.
౨౩ అయితే యీ ప్రాంతములయందు యికమీదట
నాకు స్థలము లేదు గనుక అనేకమైన సంవత్సర
ములనుంచి మీ యొద్దికి రావలెనని మిక్కిలీ అపేక్ష
కలిగినందున నేను స్పానియలోకి వెళ్లేటప్పుడు
౨౪ మీ యొద్దికి వత్తును యెందుకంటే ప్రయాణములో
మిమ్మును చూచుటకున్ను మొదట మీ సహవాస
ము వల్ల కొంతమట్టుకు తృప్తిపొందినట్టయితే మీ
వల్ల అక్కడికి సాగనంపించబడుటకున్ను నిరీక్షిస్తు
న్నాను. అయితే యిప్పుడు పరిశుద్ధుల కొరకు ౨౫
వొక పని మీద యెరూశలేముకు వెళ్లుతున్నాను
యెందుకంటే యెరూశలేములో వున్న పరిశుద్ధుల ౨౬
లో బీదలైన వారి నిమిత్తము మకెదోనియ అఖా
యియ దేశస్థులు యిష్టము వచ్చి వొక చందా చేసి
యున్నారు. అవును వారికి యిష్టమే యెందు ౨౭
కంటే వీరు వారికి ఋణస్థులై యున్నారు యెందు
కంటే అన్యజనులు వారి ఆత్మ సంబంధమైన వాటి
లో పాలు పొందినట్టయితే శరీర సంబంధమైన
వాటి విషయమై వారికి సహాయము చేయతగును.
కాబట్టి నేను యీ పని నెరవేర్చి యీ ఫలము ౨౮
వారికి ముద్రవేసి మీ వైపుగా స్పానియకు ప్రయా
ణము చేతును. మరిన్ని నేను మీ యొద్దికి వచ్చి ౨౯
క్రీస్తు సువార్తయొక్క ఆశీర్వాద పరిపూర్ణతతో
వత్తునని యెరుగుదును.
మరిన్ని సహోదరులారా నేను యూదైయ ౩౦-
లో అవిధేయులనుంచి తప్పించబడే నిమిత్తమున్ను
యెరూశలేము కొరకైన నా సేవ ఆ పరిశుద్ధులకు ౩౨
అనుకూలమయేటందుకున్ను నేను దేవుని చిత్తము
వల్ల సంతోషముతో మీ యొద్దికి వచ్చి మీ మధ్య
ను విశ్రమించేటందుకున్ను మీరు నా కొరకు
దేవుని గురించి ప్రార్థనల యందు నాతోకూడా
ప్రయత్నము చేయ వలెనని మన ప్రభువైన యేసు
క్రీస్తు నిమిత్తమున్ను ఆత్మయొక్క ప్రేమ నిమిత్తము
న్ను మిమ్మును బతిమాలుకొంటున్నాను. సమా ౩౩
ధానముయొక్క దేవుడు మీ అందరికి తోడై యుం
డును గాక. ఆమేన్.

## ౧౬ పర్వము.

కెంక్రెయైలో వున్న సంఘపు పరిచారకురా ౧-౨
లైన ఫేబే అనే మన సహోదరిని మీరు పరిశు
ద్ధులకు తగినట్టుగా ప్రభువులో చేర్చుకొని యే
పనిలోనైనా ఆమెకు మీ వల్ల సహాయము కావ
లసియుంటే ఆమెకు సహాయము చేసే కొరకు
ఆమెను మీకు సిఫారసు చేస్తున్నాను యెందుకం
టే ఆమె అనేకులకున్ను నాకున్ను సహాయకురాలై
యుండెను.
క్రీస్తు యేసు యందు నాతోటి పనివారైన ౩-౪
ప్రిస్కిల్లనున్ను అకులనున్ను వారి యింట్లో వున్న
సంఘమునున్ను కౌగిలించండి వీరు నా ప్రాణము
కొరకు తమ మెడలను వంచుకొనిరి. నేను మా
త్రమే కాదు అన్యజనుల సంఘములన్నిన్ని వీరిని
స్తోత్రము చేస్తున్నవి. అఖాయియలో క్రీస్తుకు ౫
ప్రథమఫలమై యున్న నా ప్రియుడైన ఎపైనెతును

౬ కౌగిలించండి. మన కొరకు బహు ప్రయాస
పడిన మరియను కౌగిలించండి. నా బంధువులు
న్ను నాతో కూడా ఖయిదీలున్నైన అంద్రొనీకు
౭ నున్ను యూనియనున్ను కౌగిలించండి. వీరు
అపొస్తలులలో ప్రసిద్ధికెక్కిరి. నాకంటే ముం
౮ దుగా క్రీస్తు యందు వుండిరి. ప్రభువు యందు
౯ నా ప్రియుడైన అంప్లియను కౌగిలించండి. క్రీస్తు
యందు నాతోటి పనివాడైన ఉర్బానునున్ను నా
౧౦ ప్రియుడైన స్తఖునున్ను కౌగిలించండి. క్రీస్తు
యందు పరీక్షించబడిన అపెల్లేను కౌగిలించండి అరి
౧౧ స్తొబూలు యింటి వారిని కౌగిలించండి. నా బం
ధువైన హేరోదియోనును కౌగిలించండి. నర్కి
స్సు యింటి వారిలో ప్రభువు యందున్న వారిని
౧౨ కౌగిలించండి. ప్రభువు యందు ప్రయాసపడే
త్రుఫైసనున్ను త్రుఫోసనున్ను కౌగిలించండి.
ప్రియురాలైన పెర్సిని కౌగిలించండి. ఆమె
౧౩ ప్రభువు యందు బహు ప్రయాసపడెను ప్రభువు
యందు యేర్పరచబడిన రూఫునున్ను అతని తల్లి
నిన్ని నా తల్లినిన్ని కౌగిలించండి.
౧౪ అసుంక్రితునున్ను ప్లెగోనునున్ను హెర్మే
నున్ను పత్రొబనున్ను హెర్మేనున్ను వారితో వున్న
౧౫ సహోదరులనున్ను కౌగిలించండి. ఫిలొలొగు
నున్ను యూలియనున్ను నేరైనిన్ని యితని సహో
దరినిన్ని ఒలుంపనున్ను వారితో వున్న పరిశుద్ధులం
౧౬ దరినిన్ని కౌగిలించండి. పరిశుద్ధమైన ముద్దుతో
వొకని వొకడు కౌగిలించండి క్రీస్తుయొక్క సంఘ
ములన్నిన్ని మిమ్మును కౌగిలించును.
౧౭ మరిన్ని సహోదరులారా మీరు నేర్చుకొన్న
బోధకు విరోధముగా భేదములనున్ను అడ్డములను
న్ను కలుగచేసే వారిని గుర్తెరిగి వారిని విడిచి
౧౮ పెట్టండి యెందుకంటే అటువంటి వారు తమ
కడుపునే గాని మన ప్రభువైన యేసు క్రీస్తును
కొలువక నయమైన మాటల* వల్లనున్ను యిచ్చక
ములవల్లనున్ను నిష్కపటులయొక్క మనస్సులను
మోసపరుచుదురు యెందుకంటే మీ విధేయత అం ౧౯
దరికిన్ని ప్రచురమైనది. కాబట్టి నేను మిమ్మును
గురించి సంతోషిస్తున్నాను. అయితే మంచి దాని
విషయమై మీరు బుద్ధిమంతులై చెడ్డదాని విషయమై
నిష్కపటులై యుండ వలెనని కోరుతున్నాను.
సమాధానపు దేవుడు శీఘ్రముగా సైతానును మీ ౨౦
పాదములకింద చితక త్రొక్కించును. మన ప్రభు
వైన యేసు క్రీస్తుయొక్క కృప మీకు కలుగును
గాక. ఆమేన్.
నా తోటి పనివాడైన తీమొథెయున్ను నా ౨౧
బంధువులైన లూకియు యాసోను సోసిపతెరు అనే
వారు మిమ్మును కౌగిలిస్తున్నారు.
ఈ పత్తరము వ్రాసిన తెర్తియు అనే నేను ౨౨
ప్రభువు యందు మిమ్మును కౌగిలిస్తున్నాను. నా
కున్ను యీ యావత్సంఘమునకున్ను ఆతిథ్యము
చేసే గాయియు మిమ్మును కౌగిలిస్తున్నాడు. ఈ ౨౩
పట్టణపు వుగ్రాణికుడైన యెరస్తున్ను సహోదరు
డైన క్వర్తున్ను మిమ్మున్ను కౌగిలిస్తున్నారు.
మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క కృప మీ ౨౪
యందరికి తోడైయుండును గాక. ఆమేన్.
మరిన్ని పూర్వకాలములయందు దాచబడి యి ౨౫
ప్పుడు బయిలు పరచబడి ప్రవక్తల లేఖనములవల్ల
శాశ్వతమైన దేవుని నిర్ణయము చొప్పున విశ్వాస ౨౬
విధేయత నిమిత్తము సమస్త దేశస్థులకున్ను తెలుప
బడిన మర్మముయొక్క ప్రత్యక్షత ప్రకారముగా
నున్న యేసు క్రీస్తు ప్రకటన అనగా నా సువార్త
ప్రకారము మిమ్మును స్థిరపరచుటకు శక్తిమంతుడు
న్ను అద్వితీయ జ్ఞానము గలవాడున్నైన దేవునికి ౨౭
యేసు క్రీస్తు ద్వారా మహిమ యెప్పటికిన్ని కలిగి
యుండునుగాక. ఆమేన్.

* లేక, స్తోత్రముల.